# ఆంధ్రపత్రిక

316904




The Andhra Patrika, Madras, } Regd No. 1118, Vol, 34 No 134 SATURDAY 6th SEPTEMBER 1947 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao


# గాంధిజీ ప్రాయోపవేశ విరమణము

## కలకత్తాశాంతిని ప్రాణాలిచ్చిఅయినా రక్షిస్తామని నాయకుల హామీ

## గత రెండురోజులుగా పట్నంలో సంపూర్ణ శాంతి

### పురప్రముఖులకు గాంధిజీ బోధ

### కలకత్తా ప్రజలకు కృపలానీ ప్రభృతుల విజ్ఞప్తి

కలకత్తా, సెప్టెంబరు 5: గాంధిజీ గతరాత్రి సరిగ్గా 9 గంటల 15 నిమిషాలకు ప్రాయోపవేశం విరమించారు. అప్పటికి ఉపవాసదీక్ష పూని 73 గంట లయింది.

ప్రాయోపవేశాన్ని విరమిస్తానని గాంధిజీ వాగ్దానంచేయగానే బెంగాల్ మాజీ ప్రధాని సురవర్దీ ఒక గ్లాసు నిమ్మరసాన్ని మహాత్మునకు అందించారు.

నవకాళీ శాంతియాత్ర సందర్భంలో కొబ్బరినీళ్లను తాగేందుకు ఉపయోగించిన గ్లాసుతో గాంధిజీకి నిమ్మ రసాన్నిచ్చారు.

దీక్షావిరమణ తర్వాత గాంధిజీ గతరాత్రి 9 గంటల కాలం సుఖంగా నిద్రించారు. మామూలుగానే ప్రాతఃకాల ప్రార్థన చేశారు. చాలా బలహీనంగా ఉన్నప్పటికీ ఆయన ఉత్సాహంగానే ఉన్నాడు.

మంగళవారం అర్ధరాత్రి నుండీ గురువారం 9 గంటలవరకూ కలకత్తానగరం యావత్తూ అతి ప్రశాంతంగా ఉంది.

ఈ స్థితిని గాంధిజీకి నివేదించి ప్రాయోపవేశ లక్ష్యం సిద్ధించినది కనుక, విరమించవలసిందని శ్రీమాన్ సి. రాజగోపాలాచారిగారు, ఆచార్య కృపలానీ, డా॥ పి. సి. ఘోష్, సురవర్దీ ప్రభృతులు గాంధిజీని వేడుకొన్నారు.

ప్రాయోపవేశాన్ని విరమించే పూర్వం గాంధిజీ, అచట చేరినప్రముఖుల నుద్దేశించి ఇలా ఉపన్యసించారు: "నూరు అరైనా, ఆరు నూరైనా కలకత్తా శాంతిని కాపాడాలి. మీరు నిత్యము నిర్వహింపవలసిన విధులలో కలకత్తా శాంతిరక్షణకూడా ఒకటని కలకత్తా శాంతిని కాపాడుట మీవిధ్యుక్తధర్మమనీ మీరు భావించాలి. కలకత్తా ప్రశాంతంగా ఉండే దాని ఫలితం నవఖాళీ, పంజాబులోనే గాక భారతదేశం అంతటా కన్పిస్తవి."

పట్టణములో తిరిగి ఏర్పడిన శాంతికి ఏ పరిస్థితులలోను తిరిగి భంగం వాటిల్లకుండా తమ శాయశక్తులా, తుదకు ప్రాణాలను ఒడ్డి అయినా సరే, రక్షిస్తామని పట్నంలోని హిందూమహాసభ, ముస్లిం లీగు, సిక్కు నాయకులు లిఖితపూర్వకంగా గాంధిజీకిహామీఇచ్చారు.

గాంధిజీ ఉపవాసం విరమించగానే అనేకమంది యువకులు ముఠాలుగా వచ్చి స్టెన్‌గన్స్, చేతిబాంబులు, మొదలైన ఆయుధ పరికరాలను, ఇతర ఆయుధసామగ్రినీ గాంధిజీ పాదాలవద్ద సమర్పించారు.

### మహాత్మునికి జార్జిరాజు సందేశం

#### ప్రాయోపవేశ దీక్షా విరమణను అర్థిస్తూ

కలకత్తా, సెప్టెంబరు 4: ఆరవ జార్జిరాజు, మహాత్మునికి పంపిన సందేశం, యీ రోజున ఢిల్లీనుంచి టెలిఫోనుద్వారా గాంధిజీ శిబిరానికి చేరింది. ప్రాయోపవేశ దీక్ష విరమణకు కొంచెం ముందుగా యీ సందేశం గాంధిజీకి నివేదింపబడింది.

జార్జిరాజు తనసందేశంలో గాంధిజీ ప్రస్తుత ఆరోగ్యంపట్ల తన ఆందోళన వ్యక్తంచేస్తూ, ఉపవాసదీక్ష విరమణను అర్థించినట్లు తెలుస్తున్నది.

ఈ సందేశాన్ని సంతోషపూర్వకంగా మహాత్మాజీ స్వీకరించారు.

### గాంధిజీ ప్రాయోపవేశ దీక్షా మహా విజయం

గాంధిజీ 4 వ తేదీరాత్రి తొమ్మిది గంటలకు నిరాహార దీక్షను ముగించారు. సోడాకలిపిన తీయ నిమ్మరసాన్ని సురవర్దీ అందివ్వగా స్వీకరించారు.

నవఖాళీ శాంతిపర్యటన సందర్భంలో తీర్థపానానికి ఉపయోగించుచున్న గాజు లోటాతో మహాత్మాజీ నేడు నిమ్మరసం పుచ్చుకున్నారు.

దీక్షా విరమణకుపూర్వం మహాత్మాగాంధీ కొన్ని కఠినతమ నియమాలను ఉద్ఘాటించారనీ, వాటన్నింటినీ, వివిధవర్గ నాయకులూ లిఖితపూర్వకంగా అంగీకరించారనీ, సురవర్దీగారు అసోసియేటెడ్ ప్రెస్ ఆఫ్ ఇండియా విలేఖరితో అన్నారు. ఈ నియమాల నంగీకరించిన నాయకులందరూ వారి వారి ప్రాంతాల్లో శాంతిభద్రతలకు సంపూర్ణ బాధ్యత వహించాలి. ఏ మాత్రం వ్యతిక్రమం జరిగినా ప్రాణార్పణకైనా సిద్ధం కావలసి ఉంటుంది.

మహాత్మాజీ ప్రాయోపవేశానికి పూనుకుని సరిగ్గా 73 గంటలకాలం గడిచింది. సోమవారం రాత్రి 8-15 కు ప్రారంభమయి నేటిరాత్రి 9-15 గంటలకు సమాప్తమయింది.

(8వ పేజీ చూడుడు)

## తిరువాన్కూరులో సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపన

### రాజ్యాంగరచనకై వయోజన వోటుపద్ధతిన ప్రజాపరిషత్తు ఎన్నిక

#### సంస్థానాధీశ్వరుని ప్రకటనకు ప్రజాప్రతినిధుల హర్షం

తిరువేంద్రం, సెప్టెంబరు 4: తిరువాన్కూరు రాజ్యాంగచట్టమును సంస్కరించుటకు అనుమతించుచూ మహారాజాగారి ప్రకటన ఈ రోజు మధ్యాహ్నం వెలువడినది. ఇంకా నాలుగు నెలలలోగా, 1948 వ సంవత్సరం జనవరి 1 వ తేదీ లోగా, వయోజన వోటింగు పద్ధతిపై ఎన్నుకొనబడిన ప్రతినిధుల పరిషత్తు సమావేశమై 1122 వ సం. (తిరువాన్కూరు శకం) రాజ్యాంగ చట్టమునకు మార్పులు, సవరణలు సూచించవలెనని మహారాజా ఉత్తరువు చేసెను. భారతదేశంలో, వయోజన వోటింగ్‌పద్ధతి ప్రకారం ప్రజాపరిషత్తు ఏర్పడటం ఇదే ప్రథమం. మహారాజా తన ప్రత్యేకాధికారము క్రింద చాలి తక్కువ అధికారములు వుంచుకొనుటవలన ఈ సభ కార్యకలాపములపై ఏ మాత్రము అదుపు వుండదు.

### మహారాజా ప్రకటన పూర్తిపాఠం

"ప్రజాభీష్టమును సంతృప్తిపరచుచూ, ప్రజా శ్రేయోభివృద్ధిని కలిగించవలెనను మా నిశ్చిత విధానము ప్రకారము, గరిష్ఠ వోటింగ్ హక్కులను ప్రసాదించు వయోజన వోటింగ్ పద్ధతిని ప్రవేశపెడుతూ 1122 వ సంలో ఒక రాజ్యాంగచట్టమును ప్రసాదించి యుంటిమి.

ఆ నిశ్చిత విధానానుగుణ్యముగానే, ఆ 1122 వ సం.పు (తిరువాన్కూరు శకం) రాజ్యాంగ చట్టమును పునరాలోచించి, మా హక్కులకు, అధికృతకు భంగము కలుగకుండునట్లు, ప్రజలకు బాధ్యతాయుత ప్రభుత్వము నొసంగవలెననుట మా అభీష్టము, సంతోషము.

అందువలన, వయోజన వోటింగ్ పద్ధతి వలన ఎన్నుకొనబడిన ప్రతినిధుల సభ ఏర్పడి, బాధ్యతాయుత ప్రభుత్వము నెలకొల్పుటకు రాజ్యాంగ చట్టములో అవసరమగు మార్పులు, సవరణలు ఆలోచించి సూచించవలెనని మేము సంతోషపూర్వకముగా ఆజ్ఞాపించుచున్నాము. మా రాజప్రాసాదమునకు, రాజకుటుంబమునకు, హిందూ దేవస్థానములకు సంబంధించిన విషయములు తప్ప తక్కిన వ్యవహారము లన్నియు ఈ సభ ఆలోచించి, మార్పులు సూచించవచ్చును.

ఈ ప్రకటనను ఆచరణలో పెట్టుటకు అవసరమగు నిబంధనలు, ఉత్తరువులు మా ప్రభుత్వము జారీచేయును.

ఈ ప్రతినిధులసభ 1948 వ సం. జనవరి 1 వ తేదీలోగా ఏర్పడి, సమావేశము కావలెనని మా ఉద్దేశ్యము. సరియైన తేదీ ప్రభుత్వ గెజిట్‌లో మా ప్రభుత్వముచే ప్రకటింపబడును."

### ప్రభుత్వ ప్రకటన

తిరువేంద్రం, సెప్టెంబరు 4: ఈరోజు మహారాజా తన ప్రకటనలో సూచించిన విధముగా నిబంధనలను ఏర్పరచుచు తిరువాన్కూరు ప్రభుత్వము ఒక ప్రకటన చేసెను. ఈ కమిటీ సభ్యుల పేర్లు తరువాత ప్రకటింపబడును. ప్రజాపరిషత్తుకు సభ్యులను ఎన్నుకొనవలసిన విధానము, ప్రజాపరిషత్తు సమావేశమునకు నిబంధనలు

(8-వ పేజి చూడుడు)

## పాకిస్తాన్ రాష్ట్రాల్లో మతకల్లోలం

### కోహట్ సమీపాన సైనిక రైలుపై రెండుదఫాలుదాడి:సింధులోసిక్కులపై దౌర్జన్యం

పెషావర్, సెప్టెంబరు 4: "కోహాటుదగ్గర ఒక మిలటరీ రైలుపై రెండుసార్లు దుండగీల్లు దాడిచేశారు" అని సరిహద్దు రాష్ట్రప్రభుత్వం ప్రకటించినది. ఈ సంఘర్షణలలో 20 మంది సైనికులుమరణించారు. 94మంది గాయపడ్డారు. దుండగీళ్ళలో 40 మంది మరణించారు. 60 మంది గాయపడ్డారు. 44 మంది దుండగీల్లు పట్టుపడ్డారు. నష్టపడ్డ సైనికుల్లో మూడోవంతుముస్లిములు.

మర్దానుకు ఉత్తరంగా తఖత్ భాయ్ అనేచోట జరిగిన కల్లోలంలో 17 మంది మరణించారు. 8 మంది గాయపడ్డారు.

#### ప్రధాని విజ్ఞప్తి

సరిహద్దు ప్రధాని కయూంఖాన్ ఈ విధంగా విజ్ఞప్తి చేశారు. ఇండియా, పాకిస్తాన్ ప్రభుత్వాలు చేసుకొన్న ఒడంబడిక ప్రకారం ప్రతి మిలటరీరైలులోనూ హిందువులూ ముస్లింలూ కలిసి వుంటారు. కాబట్టి ఎవరూ వాటిమీద దాడిచేయకూడదు. దేశంలో కల్లోలాలు జరుగకూడదు.

#### సింధులో సంఘటనలు

కరాచీ, సెప్టెంబర్ 4: కరాచీలో మొట్టమొదటిసారిగా మత సంఘటన ఒకటి ఈ వేళ ఉదయం జరిగినది. నల్ల ముసుగు వేసుకొన్న ఒక వ్యక్తి ఒక సిక్కును పొడిచిచంపి సైకిలుమీద పారిపోయినాడు. కరాచీకి 10 మైళ్లలోవున్న మానోరా విమానాశ్రమం వద్దన మత సంబంధమైన కలహాలవల్ల తుపాకి దెబ్బలతో ముగ్గురు మరణించారనీ, కొందరుగాయపడ్డారనీ వార్త వచ్చినది. ప్రజలంతా శాంతంగా ఉండాలనీ, కల్లోలం బయలుదేరితే నిర్దాక్షిణ్యంగా అణిచివేస్తామని జిల్లా మేజిస్ట్రేటు ప్రకటించాడు.

## ఐక్యరాజ్యసమితి అధ్యక్షపదవి

### ఈ సారి విజయలక్ష్మి పండిట్‌కు ప్రాప్తించే సూచన

న్యూయార్కు, సెప్టెంబరు 4: ఈ మాసంలో జరుగనున్న ఐక్యరాజ్యసమితి సమావేశానికి అధ్యక్షతవహించగల సముచితమయిన వ్యక్తి శ్రీమతి విజయలక్ష్మి పండిట్ అని, కనుక ఆమెనే అధ్యక్షస్థానానికి ఎన్నుకోవడం సముచితమని, యిక్కడివర్గాలలో తరచు వినపడుతున్నది. ఈసారి సమావేశం అధ్యక్షపదవికి తీవ్రమైన పోటీ జరుగుతుందని, ఉదాహరణగా ఆస్ట్రేలియా ప్రతినిధి హెర్బర్ట్ ఎవాట్, చెకోస్లొవేకియా ప్రతినిధి, విజయలక్ష్మి పండిట్ అధ్యక్షత్వాన్ని పోటీచేస్తారని రాజకీయ ఆప్తులు భావిస్తున్నారు.

అధ్యక్షపదవికి పోటీచేయగల ప్రముఖ వ్యక్తులు యీ మువ్వురేననికూడా వీరు విశ్వసిస్తున్నారు.

## తూర్పు పంజాబ్ ప్రభుత్వ ఉద్యోగుల అరెస్టు : గవర్నరు జోక్యం

### బ్రిటిష్ సైనికాధికారి ప్రవర్తన గురించి విచారణ

అమృతసర్, సెప్టెంబర్ 3: "తూర్పు పంజాబు కల్లోలాల పరిస్థితి చక్కబడుతున్నది. అమృతసర్, గురుదాసపూర్ జిల్లాలలో దాదాపు వందమైళ్లు కార్లమీద పండిత నెహ్రూతో కలసి పర్యటించి గ్రామసీమలన్నీ ప్రశాంతంగా వుండటం పాకిస్థాన్ ప్రధాని లియాకత్ ఆలీఖాన్ స్వయంగాచూశాడు" అని వారితో కలిసి పర్యటించిన ఏసోసియేటెడ్ ప్రెస్ విలేఖరి వ్రాస్తున్నాడు. గురుదాసపూర్ జిల్లాలో రెండు డొమినియన్ల సరిహద్దుల్లోవున్న భీతాహం తప్ప మిగిలిన ప్రాంతం అంతా ప్రశాంతంగా ఉన్నది.

ప్రధానులతోపాటు తూర్పు పంజాబు మంత్రి సర్దార్ స్వర్ణసింగ్, పశ్చిమపంజాబుమంత్రి సర్దార్ షౌకత్ హయత్‌ఖాన్, మహమద్ ఇస్లాయి (పాకిస్థాన్ ఉద్యోగి) హెచ్. ఆర్. వి. అయ్యంగార్, బ్రిగేడియర్ తిమ్మయ్యలు పర్యటనలో పాల్గొన్నారు. వీరు ఈవేళ ఉదయం లార్డ్ మౌంట్‌బాటన్ విమానంలో అమృతసర్లో దిగి వెంటనే, గురుదాస్‌పూర్‌కు కార్లలో వెళ్లిపోయినారు.

8-వ పేజి చూడుడు

## ప్రకటన

గద్వాలు (నైజాం)లో మా ఆంధ్ర దినపత్రిక, సచిత్ర వార పత్రిక, భారతి మాసపత్రిక వారి స్వంత బాధ్యతపై విక్రయించుటకు శ్రీమతి బి. వి. చెట్టిగారిని 6-9-47 నుండి న్యూస్ ఏజెంటుగా నియమించినాము.

మేనేజరు

## గంటల పంచాంగం

సర్వజిత్ నం॥ ని. శ్రావ॥ బ॥ షష్ఠి 1947 సం॥ సెప్టెంబరు 6 శనివారం

బ॥ షష్ఠి రా 11 28 భర ప1-35 వర్జ్యం రా 1-26 ల 3-1 వ.

బ॥ సప్తమి సెప్టెంబరు 7 ఆదివారం

బ॥ సప్తమి రా 10 18 కృత్తిక ప 1 18 వర్జ్యం తె 4-46 వ.


ఆంధ్రపత్రిక

సర్వజిత్ నం॥ ని. శ్రావ బ॥ షష్ఠి

శనివారము


## విరమణ

గాంధిజీ ఉపవాసదీక్ష విరమించెను. ఆయన ఉపవాసదీక్ష ప్రారంభించెనను వార్త దేశమును ఎంత విచారమున ముంచినదో విరమణ వార్త అంత సంతోషమున ముంచినది. పెద్ద ప్రమాదము తప్పినదని దేశము నిట్టూర్పు విడిచినది. దేశములో గత సంవత్సరము సెప్టెంబరునుండి జరిగిన హింసా సంఘటనలు ఆతనికి మిక్కిలి సంతాపము కలుగజేసినవి. అంత్యకాలమున ఆయన శరీర స్వాస్థ్యము కూడ కొంత సన్నగిల్లి యుండవచ్చును కాని అజేయమైన ఆయన ఆత్మబలము దీనికి అతీతమై ప్రకాశించినది. కలకత్తా శాంతిమయమైనది. విరుద్ధతత్వము గల విభిన్న పక్ష నాయకులు, మత విద్వేషము ను తిరిగి తలయెత్తనీయమని, దాని నివారణకు ప్రాణములర్పింప సిద్ధముగ నుంటిమని ప్రతిజ్ఞాపత్రము ను వ్రాసి యిచ్చిరి. వివిధవర్గములకు చెందిన యువకులు తమ దగ్గరనున్న ఆయుధములను గాంధిజీ పదాంబుజములవద్ద పరిత్యజించిరి. ఇంతకన్న మహత్తర సంఘటన సంభవించునని ఊహించుటకు వీలులేదు. అగోచరమగు ఆత్మశక్తి ప్రభావ నిరూపణకు ఇంతకన్న నిదర్శన మక్కరలేదు. గాంధిజీ అమోఘ సత్యాగ్రహ సిద్ధాంతమునకు ఇది మరొక విజయము. "నా మాటలు సాధించనిది నా ఉపవాసము సాధించ వచ్చునని" దీక్షా ప్రారంభ సందర్భమున ఆయన తెలిపియుండెను. అదే విధముగ జరిగినది.

నాయకులు ప్రతిజ్ఞాపత్రమును వ్రాసియిచ్చుటచేత గాంధిజీ ఉపవాస దీక్షను విరమించెను. అందువల్ల మత సామరస్యమును స్థాపించుటకు గాంధిజీ వహించిన భారమును వీరు తమపైన పెట్టుకొనిరి. గాంధిజీ చెప్పినట్లు వారు వ్రాసి ఇచ్చిన పత్రముకన్న వారి ఆంతర్యము ప్రధానము. కలకత్తాయందు శాంతిస్థాపనా కార్యభారము వారి కప్పగించి మత విద్వేషాగ్నిలో కుమిలిపోయిన పంజాబుకు పయనమై పోవనున్నాడు. మత కలహములు ప్రప్రథమముగా కలకత్తాలో చెలరేగినవి కాబట్టి, కలకత్తాలోనేర్పడు శాంతిపైననే పంజాబు, నౌఖాళీల శాంతి ఆధారపడియున్నది.

పంజాబు విషయమున ఉభయ అధినివేశ ప్రభుత్వములు ఒప్పందమునకు వచ్చినవి. దీనికి తోడుగ గాంధిజీ కూడ అక్కడకు వెళ్లిన అనతికాలములో శాంతి ఏర్పడుననుటకు సందేహము లేదు. శరణార్థులను చేరవేయుటలో ఉభయ ప్రభుత్వములు అనుసరింపదలచిన ఏర్పాటును గురించి ఒక మాట చెప్పవలసి యున్నది. వాహన సౌకర్యముల ప్రయోజనము వృథా పోకుండుటకు గాను ఒక రాష్ట్రములో శరణార్థులను దింపిన తరువాత, వాహనములు ఖాళీగా వెళ్లకుండ, అక్కడనుండి వెళ్లదలచిన వారిని తిరుగు ప్రయాణములో తీసికొని పోవుటకు, దారిలో వారి రక్షణకు, వెంట కావలా ఏర్పాటు చేయుటకు నిర్ణయించబడెను. ఈ సందర్భమున భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖామంత్రి అమృతకౌర్, సెయిల్ కోటనుండి అమృతసర్ కు వెడలుచున్న సిక్కు శరణార్థుల రక్షణ విషయమున పంజాబు సరిహద్దు సేనలోని ముస్లిము సైనికులు ప్రదర్శించిన వైఖరిని జ్ఞప్తికి తెచ్చుకొనుట మంచిది. పశ్చిమపంజాబు నుండి ఎంతమంది శరణార్థులు వెడలుచున్నారో అంతమంది స్వమతస్థులను తిరిగి తూర్పు పంజాబునుండి తీసికొని రావచ్చునని హామీ ఇచ్చినగాని రక్షణ ఇచ్చుటకు శరణార్థులవెంట వెళ్ల నిరాకరించిరి. ముస్లిము దుండగులు శరణార్థులను హత్య చేయుచున్నను మెదలక యూరకుండిరి. కాబట్టి పశ్చిమ పంజాబు నుండి తూర్పు పంజాబుకు పోవు శరణార్థుల వెంట ముస్లిమేతర సైనికులనే రక్షణనిమిత్తము పంపుట అవసరము. ఉభయమతములకు చెందిన సైనికులను రక్షణకు పంపుట కొంతవరకు సంతృప్తికరమైన సంగతి. వాహనసౌకర్యములలభ్ధిని బట్టి, చరాస్తిని తీసికొనివెళ్ల వలసి వచ్చునని. ఈ సౌకర్యముల లబ్ధిని ఆ రాష్ట్ర ప్రభుత్వమే నిర్ణయించును కాబట్టి సౌకర్యములు కొద్దిగా యున్నవన్న నెపముతో తీసికొని వెళ్లదలచిన చరాస్తి ప్రమాణమును తక్కువచేయుటకు ప్రయత్నించవచ్చును. అట్టినిరోధములు కలుగకుండ చూడవలసి యున్నది. స్థిరాస్తి ఎలాగూ తీసికొని వెళ్లుటకు వీలుండదు. ఇక చరాస్తిని కూడ సంపూర్ణముగ తీసికొని వెళ్లుటకు సదుపాయములను కల్పించకపోవుటలో అర్థములేదు.

స్థిరాస్తులను గురించి ఒక అంశము స్పష్టము కావలసియున్నది. అక్రమ ఆక్రమణ గుర్తింపబడదని వెళ్లిపోయిన వారి ఆస్తిని కాపాడుటకు ఉద్యోగులను నియమించుటకు నిర్ణయించిరి. కాని అది చాలదు. వదలిపోయిన వారిలో తిరిగివచ్చి కాపురము చేయు అభిలాష కలవారు ఎక్కువమంది యుండరు. అనేకులు ఆస్తి అమ్ముకొను ఉద్దేశముతోనే యుందురు. ప్రస్తుతవాతావరణమునుబట్టి ప్రభుత్వ ప్రసక్తిలేకవ్యక్తిగతలావాదేవీల మూలమున సమంజసమైన ధర లభించుట అనుమానమే కాక, అసాధ్యముకూడ. కాబట్టి ఆయా రాష్ట్రప్రభుత్వములే స్థానిక ధరను బట్టి తగనరూపమున పరిహారమిచ్చుటకు ఏర్పాటు చేయవలయును.

## పండ్లు, కూరగాయల వర్తకుల సంఘము

### రాష్ట్ర సభావేశములో ప్రముఖుల ప్రసంగాలు

చెన్నపురి, సెప్టెంబరు 5: ఆహారపదార్థములలోకల్లా అగ్రగణ్యములైనవి పండ్లు, కాయగూరలు. ఈ ఆహార కొరతదినములలో, పండ్లు కాయగూరల ఉపయోగమును అధికముగా వ్యాప్తిచేయుట అతి లాభకరము. పంటలకుత్పత్తికి మన రాష్ట్రములో కావలసిన వసతులన్నీ ఉన్నవి. రాష్ట్రములో ఇంగ్లీషు కాయగూరలు కూడా పండించబడుచున్నవి. అట్టిచో మన ఈవ్యాపారము అభివృద్ధి చెందకుండుటకుగాని, ఉత్పత్తికి తగిన వినియోగము లేకుండుటకుగాని కలకారణమేమి? మన ఆర్థికస్థితి సక్రమముగాలేదు; జీవనాభివృద్ధికి వీలగు వాతావరణము కల్పింపబడలేదు అని ప్రథమ చెన్నరాష్ట్ర పండ్లు కూరగాయల వర్తకుల, కమీషన్ ఏజెంట్లమహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ యస్. నటేశ ముదలియార్ గారు ఉపన్యసించిరి. డా॥ పి. సుబ్బరాయన్ గారు ప్రారంభోపన్యాసము చేయుచూ, జాతీయ అంతర్జాతీయ రాజకీయములను విశదీకరించిరి. ఆహార శాఖ మంత్రి, ఆర్థిక సమస్యలు, పిల్లల పైనం గూర్చి మాట్లాడలేదు కాని తాను పండ్లు కూరగాయ వర్తకులను జాగ్రత్తగా వ్యాపారము చేయుమని సలహా చెప్పుటకన్న వేరు ఏమీ చెప్పజాలమనిరి.

శ్రీ నటేశ ముదలియారుగారు మాట్లాడుచూ, పండ్లు, కూరగాయలపై అమ్మకపు పన్ను వేయుట అన్యాయమనిరి. అసలే పండ్లు, కూరగాయలు అధికముగా ప్రజలు ఉపయోగింప వేర్వని కాలములో వాటిపై పన్నులువేసి, ధరలను పెంచి ప్రజలకు అందుబాటులో లేకుండచేయుట భావ్యముకాదనిరి. అదీ కాక విద్యాగంధములేని ఈ వర్తకులను లెక్కలు వ్రాయుమనుట దారుణము. వీటివలన అనేక చిక్కులేర్పడుచున్నవి. ఇతర రాష్ట్రములలో ఈ పన్నుల చిక్కు లేదు. ఈ ఒక్క రాష్ట్రములోనే ఈ పన్ను అమలులో నుండుటచే ఎగుమతి, దిగుమతుల లాభముల నిచ్చుటలేదు. అదీకాక కేంద్ర ప్రభుత్వమువారు పండ్లు కూరగాయల రైల్వే రవాణాకు రెట్టింపు చార్జి చేయుచున్నారు. పోర్టర్లు ఈ సుకుమార ద్రవ్యములను అతి అజాగ్రత్తతో చూచి నష్టము తెచ్చుచున్నారు. ఇన్ని అడ్డంకులతో ప్రజలకు సరియైన జీవపోషక ఆహారపదార్థములైన పండ్లు కూరగాయలు సక్రమముగా లభించుటకు వీలుకాదు. అని శ్రీ మొదలియారుగారు చెప్పిరి.

మహాసభాధ్యక్షుడు శ్రీ సౌందర పాండ్య నాడారుగారు రైళ్లలో కోల్డ్ స్టోరేజ్ ఏర్పాటు చేయవలెనని ప్రభుత్వమునకు విన్నవించిరి.

శ్రీ శ్రీరాములునాయుడుగారు వందనము లర్పించిరి.

వేదికపై సగముమంది ఆంధ్రులైన ఈ తెలుగుబిడ్డ మాత్రము ఉపన్యాస వేదికనుంచి— శ్రీరాములు నాయుడుగారి వందనములు తప్ప వినరాలేదు. దీనికి ఆంధ్రా ప్రతినిధులు ఆక్షేపణ తెలిపిరి.

### శ్రీ శంకర్రావ్ దేవ్ ఆంధ్రదేశ పర్యటన

బెజవాడ, సెప్టెంబరు 3: అఖిలభారత కాంగ్రెసుసంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ శంకర్రావ్ దేవ్ గారు సెప్టెంబరు 20, 21, 22 తేదులందు ఆంధ్రదేశంలో సంచారం చేసి, కాంగ్రెసు సేవకులను కలుసుకొని, జాతీయ కాంగ్రెసు పునర్నిర్మాణంగూర్చి చర్చించెదరని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శి తెలుపుచున్నారు.

### ఆంధ్రరాష్ట్ర మహిళా మహాసభ వాయిదా

మద్రాసు, సెప్టెంబరు 4: ఆంధ్రరాష్ట్ర మహిళా కాంగ్రెసు కార్యదర్శి శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు క్రింది ప్రకటన చేస్తున్నారు.

"ఆంధ్రరాష్ట్ర రాజకీయ మహిళా మహాసభ ఈ నెలకి, 9 తేదీలలో మద్రాసులో జరుగుతుందనియిదివరకు ప్రకటింపబడినది.

కాని మహాసభ అధ్యక్షత వహింపనున్న శ్రీమతి కామేశ్వరమ్మగారు, ప్రారంభకులు శ్రీమతి విద్యాదేవిగారు, కొన్ని అనివార్య ప్రతిబంధకాలవల్ల ఆనాటి మహాసభకు రాలేకపోతున్నారు. కనుక ప్రస్తుతానికి మహాసభ వాయిదా వేస్తున్నాము. తిరిగి యెప్పుడు జరిగేదీ తేదీలు త్వరలో ప్రకటించబడును.

### ఎస్ప్లనేడ్ లో హిగిన్ బాథమ్స్ శాఖ

చెన్నపురి, సెప్టెంబరు 5: హిగిన్ బాథమ్స్ పుస్తక వ్యాపారుల సరికొకటి ఎస్ప్లనేడ్ లో నేషనల్ ఇం జనీరింగ్ కంపెనీ భవనములో శ్రీ. వి. జి. యస్. వి. ప్రసాద్ గారిచే ప్రారంభించబడినది.

నిన్న సాయంకాలం 5.30 గంటలకు శ్రీ పి. చంద్రారెడ్డిగారు ప్రారంభోత్సవం జరిపిరి.

## జపాన్, కొరియాల విషయమై అమెరికా రష్యాల తగాదా

లండన్, సెప్టెంబర్ 4: జపాన్, కొరియాల విషయమై అమెరికా రష్యాలమధ్య అభిప్రాయభేదాలు అంతకంతకూ హెచ్చుచున్నట్లు దూరప్రాచ్యదేశాల వార్తలను బట్టి, మాస్కో రేడియో వ్యాఖ్యానాలూ సోవియట్ పత్రికల వ్రాతలనుబట్టీ విశదమవుతున్నది.

"కొరియాలో ఎన్నికలు జరపాలని సోవియట్ యూనియన్ చేసిన ప్రతిపాదనకు అంగీకారం, తనపై వాతీ దేశాల్లో జరిపినట్లుగా కొరియాలో కూడా జరపాలనే." అని కొరియాలోని సోవియట్-అమెరికన్ జాయింటు కమిషన్లో అమెరికా ప్రతినిధి జనరల్ బ్రౌన్ అన్నాడు. రష్యా చెప్పినట్టు చేస్తే, కొరియా పార్లమెంటులో వారి పక్షాలకు శక్తివంతమైన కృత్రిమ సంఖ్యాబలం వస్తుంది. అందుచేత అమెరికా దానికి అంగీకరించదని జనరల్ బ్రౌన్ అన్నాడు.

"జపాన్ సేనాధిపతులు, సైనిక బలాన్ని రద్దుచేసే సంస్థల్ని అనే పేర్లతో తమ వెనకటి కార్యక్రమాన్నే సాగిస్తున్నారు. వీరికి ఇప్పుడు అమెరికా తో ధ్యాటుకూడా ఉన్నది." అని మాస్కో రేడియో విమర్శించింది. కమ్యూనిస్టు పత్రిక 'ప్రవ్డా' ఈ విధంగా వ్రాసింది: "అమెరికా జపాన్ యుద్ధ నేరస్థులకు ఆశ్రయం ఇస్తున్నది. ప్రాణాలకు తెగించి విమానాలను నడిపే జపాన్ చోదకులను అమెరికన్ విమానదళంలోకి చేర్చుకుంటున్నారు."

జపాన్ లోని యుద్ధ పదార్థాలను తయారుచేసే సౌకర్యాలను పూర్తిగా తొలగించవలసినదని జనరల్ మెకార్థర్ ఉత్తర్వు చేశాడు.

### హంగరీకొత్తప్రభుత్వం రాజీనామా

బుడాపెస్ట్, సెప్టెంబర్ 4: సోషల్ డెమోక్రాట్ పక్షం ఎదురు తిరగటంవల్ల కొత్తగా ఏర్పడ్డ హంగరీ క్షేమ ప్రభుత్వం ఈరోజే రాజీనామా ఇచ్చింది ఎన్నికల్లో ఈ పక్షానికి మూడోస్థానం వచ్చింది. ఎన్నికల్లో కమ్యూనిస్టులు చేసిన అక్రమాలకు నిరసనగా వీరు ఎదురుతిరిగారని హంగరీ వార్తా సంస్థ ప్రకటించింది.

స్మాల్ హోల్డర్స్ పార్టీలోని మితవాదుల నాయకుడు ఇస్ట్వాన్ జోల్ మోకీని ఇప్పుడే విడుదలచేశారు. ఎన్నికలు కాగానే ఇతడిని అరెస్టుచేశారు.

స్మాల్ హోల్డర్స్ పార్టీకి చెందిన ప్రధానిని అతని అనుచరులనూ కొత్తప్రభుత్వం ఏర్పడేదాకా అధికారంలో వుండమని హంగరీ అధ్యక్షుడు కోరాడు.

### ఇండొనేసియాలో యుద్ధం

బటేవియా, సెప్టెంబర్ 4: తూర్పు, మధ్యజావాలలో డచ్ వారు తీవ్రతరముగా దాడులు జరుపుచున్నట్లు రిపబ్లికన్లు ప్రకటించారు. తూర్పుజావాలో మలాంగ్ కు తూర్పుగానున్న సెగడ్జిపైన, మధ్యజావాలో బండ్జర్ నెగరాపైనను డచ్ వారు దాడిచేశారు. ఉత్తర జావా కోస్తాలోనిపోటి, జపరలపై డచ్ యుద్ధనౌకలు దాడిసలిపినవి. సుమత్రాలో సుబంగ్ ప్రాంతంలో మజలెంగ్కా దగ్గర, బారిటం ప్రాంతంలో కాయర్ల్యాపైనను డచ్ విమానములు దాడి చేసినవి. డచ్ ఆక్రమిత ప్రాంతములలో రిపబ్లికన్ గెరిల్లాల చర్యలు తీవ్రమగుచున్నవని డచ్ వారు ప్రకటించారు.

### ఇండొనేసియా నాయకులతో విదేశకన్సల్ సంప్రదింపులు

యుద్ధవిరమణ ఉత్తరువులు ఏవిధముగా పాటింపబడుచున్నవో పర్యవేక్షణ జరుపుటకు ప్రయాణమైన వివిధదేశముల కన్సల్ లు ఈరోజు జోగ్జకర్తా చేరినారు.

ఆస్ట్రేలియా డిప్యూటీ కన్సల్ జనరల్ చార్లెస్ ఈట్సన్, ఫ్రెంచికన్సల్ జనరల్ ఎటినీషావ్ గారలు డా. సౌకర్నో, డా. మరసుద్దీన్ గారలతో సంభాషించిరి. బ్రిటిషు డిప్యూటీ కన్సల్ జనరల్ ఈనాడు జోగ్జకర్తా వెళ్ళను. వీరివెంట పత్రికా లేఖకులనెవ్వరినీ తీసుకు వెళ్లలేదు.

### డచ్ మంత్రివర్గ సమావేశం

హేగ్, సెప్టెంబరు 4: ఇండొనేసియాలో యుద్ధవిరమణ ఉత్తరువులను ఉల్లంఘించుచున్నటు జరుగుచున్న ఆరోపణలను గురించి చర్చించుటకు డచ్ మంత్రివర్గము ఈరోజు సమావేశమైనది. డచ్ గవర్నర్ జనరల్ డా. వాన్ మూక్ పశ్చిమ జావాలో డచ్ కమిషనర్ అబ్దుల్ క్వదీర్ గారలు ఈ సమావేశమునకు హాజరైరి. ఈ సమావేశములో ప్రకటన యేమీ చేయలేదు. మంత్రివర్గము రేపు కూడ సమావేశమగును.

## బెంగాలులో గాంధీజీ ఒక్కరే అనంతశక్తియుత సరిహద్దు సైన్యం

### దీక్షావిరమణపై దేశం నలుమూలలా హర్షం

### ప్రజలకు రాజాజీ విజ్ఞప్తి

కలకత్తా, సెప్టెంబరు 5:

"గాంధీజీ తమ జీవితంలో అనేక మహా విజయాలు పొందారు. కాని ఆ ఉద్దేశంలో వాటి అన్నింటికంటె, స్వాతంత్ర్య సంపాదనకంటె కూడా, కలకత్తాలో సౌహార్ద్రాన్ని నిర్మూలించి సౌజన్య సామరస్యాలు నెలకొల్ప గలగడం ద్వారా ఆయన సాధించిన విజయం మహోత్కృష్ట కారకం. ఆయన అనంతప్రేమకూ, శాంతి సందేశానికీ, నిఖిల భూతదయకూ నిర్వ్యాఖ్యమే మహాభాగ్యం బెంగాలు ప్రజలకు లభించింది. బెంగాలులో సామాన్య ప్రజలూ నాయకులూ కూడా ఈ మహదవకాశ ప్రాముఖ్యాన్ని గుర్తించి అన్యోన్య సహకార సుహృద్భావాలను స్వీయజీవితాల్లో అనుష్ఠించడం ద్వారా యావద్భారతదేశానికీ మార్గదర్శకులు కాగలరని నా విశ్వాసం.

అందుచేత వివిధవర్గాలకు చెందిన బెంగాలు ప్రజలందరూ ఆదివారంనాడు సమావేశమయ్యి భగవంతునకు కృతజ్ఞత తెలపాలని విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ రాష్ట్రంలో చర్చి చాపెలూ, మందిరమూ గురుద్వారమూ, మసీదూ ప్రార్థనహాలూ సకల దైవపూజా స్థలాలూ మహాత్ముని ఆయురారోగ్యాలను వాంఛించే కృతజ్ఞతా వినమ్రమైన స్త్రీపురుష బాలబాలికా జన సమూహాలతో నిండి కృతమై వారు హృదయపూర్వకంగా చేసే దైవ ప్రార్థనలతో ముఖరితమగుగాక!

దేశంలో మరొకచోట సరిహద్దు రక్షణకై నియమింపబడిన 50000 మంది సైనికులుగల సైన్యం ఏమీ చేయలేక పోయింది. కాని బెంగాలులో మహాత్మాగాంధీ ఒక్కడూ మహాశక్తి సంపన్నమైన సైన్యాన్ని అతిశయించావని ఒక ప్రముఖ సైనికుడన్నాడు. నిజంగానే ఆయన ఒక్కడూ ఎన్నెన్నో ప్రమాదాలతో నిండి వున్న అనేక సరిహద్దులలో సర్వప్రజలనూ రక్షించగల మహాసైన్యం. మనకోసం భగవంతుని కరుణాధార ఆయనపై నిరంతరం వర్షించుగాక!

ఆదివారంనాడు భారతదేశంలో అన్ని చోట్లా, అన్ని ప్రధానస్థలాల్లోనూ కృతజ్ఞతా ప్రార్థనలు జరపాలని భారతీయులకు నా విజ్ఞప్తి. దేశంలో సర్వత్రా మానసికారోగ్యం చేకూరాలనీ, అతిక్రమంగా వృద్ధిపొందాలనీ ప్రపంచ మానవకోటి కంతటా కాంతిదూతయైన మనకు అత్యంత ప్రియతముడైన మహాత్మాజీ ఇంకా ఆయురారోగ్యాలు పొందాలనీ కోరుతూ ప్రతిచోటా ప్రార్థనలు జరపాలి"

### ఉపవాస విరమణానంతరం గాంధీజీ స్థితి

ఇవ్వాళ తెల్లవారిన దగ్గరనుంచి ఆకాశం మేఘావృతమై వర్షభయం కలిగిస్తున్నా లెక్కచెయ్యక గాంధీజీ దర్శనార్థమై వేలాది మహమ్మదీయులూ హిందువులూ వచ్చి ఆయన బసవద్ద ఆతురతతో నిరీక్షిస్తూ కూర్చుంటున్నారు.

కలకత్తాలో వివిధ ప్రాంతాలనుంచీ, దేశంలో అనేకచోట్లనుంచీ ఆయన బసకు విరివిగా అభినందనలు వస్తున్నాయి. మహాత్మాగాంధీ ప్రాయోపవేశం విరమించినందుకు తమ పట్టరాని సంతోషం తెలియజేస్తూ ఆయన ఎల్లా ఉన్నారో తెలుపమని కోరుతూ వారంతా ఆతురతను వెల్లడించారు.

కలకత్తా తాత్కాలిక మేయరు గోవిందిలాల్ గోయెంకా, ఒరిస్సా ప్రధాని నబకృష్ణ చౌదరి దాసుగారు కూడా ఇవ్వాళ ఉదయం గాంధీజీ దర్శనార్థమై వచ్చారు.

మహాత్మాజీని పరీక్షించిన తర్వాత ఆస్పత్రి మెడికల్ ఆఫీసర్ డాక్టర్ దాసు ఇల్లా అన్నారు.

"మహాత్మా చాల బలహీనంగా ఉన్నారు. ఆయనను మాట్లాడనీయకుండా రాకపోవడం చాలా మంచిది.

ఇప్పటికైనా కలకత్తా పౌరులకు వివేకోదయమైనందుకు భగవంతుని కృతజ్ఞత తెలుపుతున్నాను. వీరి వివేకం వల్ల అనియాఖండం మహోజ్వలరత్నం అద్వితీయ స్వతంత్ర భారత నిర్మాత, అయిన సజీవమహాశక్తి గాంధీజీ ప్రాణం రక్షింపబడింది. గాంధీజీ త్వరలో కోలుకుంటారని మనమందరమూ ఆశిద్దాము"

### సర్ కొండి వెంకట రామమూర్తి

ఉదయపూరు, సెప్టెంబరు 4: నిన్న సర్ ఎస్. వి. రామమూర్తిగారు ఉదయపూరు మహారాజావారి యెదుట ఉదయపూరు సంస్థాన ప్రధానిగా ప్రమాణము స్వీకరించిరి. రాజ్యాంగ, విదేశాంగ, రాజకీయ, పోలీసుశాఖలు వారి అధీనమునందుండును. అ. ప్రె.

## హైదరాబాదులో స్త్రీల సత్యాగ్రహం

### నిర్బంధం నలుగురి అరెస్టు

హైదరాబాదు, సెప్టెంబరు 5: శ్రీయుతులు విమలాబాయి మేల్కోట్, పంగ్రీకర్, అహల్యాబాయి, సంగీబాయి విజయావర్గీ అనేగారు. ఈ ఉదయం సుల్తాన్ బజార్ గడియారం స్తంభం వద్ద భారత సమాఖ్యకుండినోత్సవం జరిపి సత్యాగ్రహం చేశారు. పోలీసులు వారిని అరెస్టుచేశారు. ఆసమయంలో అక్కడ కూడిన వారిలో సత్యనారాయణ మేల్కోట్, సర్దార్ సింగ్ గార్లను 145 వ సెక్షను ఉత్తర్వును ఉల్లంఘించినందుకు అరెస్టుచేశారు. సుల్తాన్ బజారుకుగల మార్గాలన్నిటిలోనూ తెల్లవార కట్టుదిట్టమైన పోలీసులు కాపలా కాస్తున్నారు. తమ తమ ఇళ్లపైనుంచి మాస్తున్నవారు నినాదాలు చేస్తూ సత్యాగ్రహులను ఉత్సాహపరిచారు.

త్రివేదిచంద్ చౌదరిగారిని పోలీసులు హైదరాబాద్ రక్షణ నిబంధనల క్రింద సోమవారం నిన్న సాయంత్రం కస్టడీలోకి తీసుకొన్నారు. (స్వ. ని.)

### బెంగుళూరు నగరములో 35 గంటల కర్ఫ్యూ

బెంగుళూరు, సెప్టెంబరు 4: ఈరోజు సాయంత్రము ఏడుగంటలు మొదలు సెప్టెంబరు 6 వ తేదీ ఉదయము ఏడుగంటలవరకున్నా అనగా 35 గంటలు బెంగుళూరు జిల్లా మేజస్ట్రేటు కర్ఫ్యూను అమలుపరచినారు. ఈరోజున సెంట్రల్ పోలీసు స్టేషన్ ఎదుట జరిగిన సంఘటన కారణముగా కర్ఫ్యూను అమలుపరచినారు. పాత సిటీకన్న గాంధీనగరానికున్న ఈ కర్ఫ్యూ అన్వయిస్తుంది. కాని కాంటోన్మెంటుకున్నూ శివార్లకున్నూ అన్వయించదు.

### హైస్కూలు లేని తాలూకాలు

మదరాసు రాష్ట్రమునందు అన్ని జిల్లాలలోను (కడపలోతప్ప) ఏదోఒక కాలేజి ఉన్నది. మొత్తం 17 తాలూకాలలో తప్ప అన్ని తాలూకాలలో హైస్కూళ్లు గలవు. హైస్కూలులేని తెలుగు తాలూకాలు యీ దిగువ పేర్కొనబడినవి:— విశాఖజిల్లాలో పాతపట్నం, చీపురుపల్లి, ప. గోదావరి—చింతలపూడి, బళ్లారి—చిరుగుప్ప, కడప—సిద్ధవటం, నెల్లూరు—పొదిలి, ఉదయగిరి, రాపూరు, దర్శి, చిత్తూరు—వాయల్పాడు, పుత్తూరు తాలూకాలు.

యుద్ధానంతర విద్యావ్యాప్తి విధానం కొరకు యీ వివరాలు ఆర్థికమంత్రిగారు తెలుసుకొనిరి.

## హౌరా ఎక్స్ప్రెస్పై దాడి

### 20 మంది మరణము 15 మందికి గాయములు

కాన్పూరు, సెప్టెంబరు 3: ఆయుధ పాణులగు మూక యొకటి నిన్న రాత్రి 9 గంటలకు ఢిల్లీనుండి బయలుదేరిన హౌరా ఎక్స్ప్రెస్పై గాజీబాద్ ఖుర్జాల మధ్యనున్న సికందర్ పూరువద్ద దాడి గావించిరని తెలియుచున్నది. ఈ జన సమూహము రైల్వే సిబ్బందిని సిగ్నలు ఇవ్వనివ్వలేదు. రైలు ఆగిపోయెను. అంతట వారు ప్రయాణీకులపైబడి మర్దించిరి. ఆ రైలులో ప్రయాణము చేయుచుండిన కేంద్ర అసెంబ్లీ కాంగ్రెస్ పార్టీ ప్రధాన సమావేశకర్త సత్యనారాయణ సిన్హాగారు చెప్పిన దాని మూలమున 20 మంది మరణించిరని, 15 మంది గాయపడిరని తెలియుచున్నది మరణించినవారి సంఖ్య, గాయపడినవారి సంఖ్య యింతకంటె యెక్కువని యితరులు చెప్పుచున్నారు. ఇంజన్ డ్రైవరు ఇంజనును ఖుర్జా తీసికొనిపోయి దాడి జరిగిన ప్రదేశమునకు పోలీసులను తీసికొని వచ్చెను.

### ఢిల్లీలో పలుచోట్ల అల్లర్లు

న్యూఢిల్లీ, సెప్టెంబర్ 4: ఢిల్లీ మ్యునిసిపాలిటీ ప్రాంతంలో వివిధప్రదేశాల లో జరిగిన సంఘర్షణల ఫలితంగా 4 గురు మరణించారు, 47 మంది గాయపడ్డారు, 5 ఇండ్లుపూర్తిగా దగ్ధమైనాయి.

తిమార్ పూర్ ప్రాంతంలో ఒకచోట బాంబు పేలింది. తత్ఫలితంగా 15 మంది క్షతగాత్రులైనారు. ఆ ప్రాంతంలోనే జరిగిన మతసంఘర్షణ ఫలితంగా 3 గురు మరణించారు. ఇద్దరు గాయపడ్డారు. సబ్జిమండీ ప్రాంతంలో మతకలహం సంభవించడంమూలంగా 17 మంది గాయపడ్డారు. సాదర్ బజార్ పోలీసుస్టేషన్ ప్రాంతంలో అక్కడక్కడా ఆరుచోట్ల కొట్లాటలు జరిగాయి. కరోల్ బాగ్ లో ఒకడు మరణించాడు. 7 గురు గాయపడ్డారు. 5 ఇండ్లు షాపులు పడుకురామ ప్రేతిలయ్యాయి. ఈ ప్రాంతాలలోకొన్నిచోట్ల కర్ఫ్యూ కాలం పొడిగింపబడింది.

### లాహోర్ నగరంలో ప్రశాంత స్థితి

లాహోరు, సెప్టెంబరు 4: సరిహద్దు సమీపంగా సాయుధ గూండాదాడులకు అవకాశమైనిమిత్తం, పడమటి పంజాబ్ తూర్పు సరిహద్దుల్లో బలీయమైన సైనిక రక్షణ నెలకొల్పబడినట్లు, పంజాబు ప్రభుత్వోద్యోగి ఒకరు తెలియజేశారు.

ఇటీవల కల్లోల సందర్భంలో ప్రప్రథమం నగరాన్ని విడిచిపోతున్న మూలంగా దుకాణాలు మాత్రం తెరువబడలేదని, లాహోరు నగరంలో పరిస్థితి ప్రశాంతం గానే ఉన్నదని యీ ఉద్యోగి తెలియజేశారు.

## కలకత్తాలో శాంతిస్థాపక సమగ్రపథక నిర్మాణానికి ప్రత్యేక సంఘం

కలకత్తా, సెప్టెంబరు 4: కలకత్తాలో సుస్థిరశాంతి స్థాపనకై ఒక సమగ్ర పథకాన్ని తయారు చెయ్యడం కోసం అన్ని వర్గాల నాయకులతోనూ ఒక ప్రత్యేక సంఘం ఏర్పడిందని రాష్ట్రపతి కృపలానీ ఒక ప్రకటన చేశారు.

ఈసంఘంలో మౌలానా ఆక్రమ్ ఖాన్, ప్రఫుల్లచంద్ర ఘోష్, హేమేంద్ర మోహన్ ఘోష్, ఎన్. సి. ఛటర్జీ, సురవర్ది, కిరణశంకర్ రాయ్, పి. యమ్. బెనర్జీ, డా॥ పి. సి. ఘోష్ గార్లు సభ్యులుగా ఉంటారు. వీరు త్వరలో సమావేశమై వచ్చిన అన్ని పథకాలనూ పరిశీలించి ఒక సమగ్ర పథకాన్ని తయారు చేస్తారు. ఈ సంఘం ఇంద్ర శాంతి స్థాపక సంఘ స్థానాన్ని ఆక్రమించవనీ, దీనికి నియమిత మైన పరిమిత ప్రయోజనం సఫలం కాగానే ఇది రద్దయిపోతుందనీ శ్రీ ఆచార్య కృపలానీ ఉద్ఘాటిస్తున్నారు.

### కలకత్తా పౌరులందరకూ ఆదివారం నిరసనదీక్ష

ఆచార్య కృపలానీ డా॥ పి. సి. ఘోష్, హెచ్. ఎస్. సురవర్దీగారు కలకత్తా పౌరులందరూ సెప్టెంబరు 7 వ తేదీ ఆదివారం నాడు నిరశనదీక్షవహించి తమతమ గృహాల్లో ఉండి ప్రార్థనలతో కాలక్షేపం చెయ్యాలని సంయుక్త విజ్ఞాపనచేశారు.

'కలకత్తా అశాంతికి తాము బాధ్యులని కలకత్తా పౌరులందరూ గుర్తిస్తున్నారు. స్వాతంత్ర్య దినోత్సవంతో ప్రారంభమైన అన్యోన్యసామరస్యం అకస్మాత్తుగా విచ్ఛిన్నమైనందువల్ల గాంధిజీ ప్రాయోపవేశ దీక్షవహించారు. మళ్లీ కలకత్తాలో శాంతి ఏర్పడింది. దీన్ని మన తేమైనా నిలబెట్టాలి. కలకత్తా పౌరులకు స్వస్థిచేసే విషయంలో అందరూ గాంధిజీతోపాటు సుస్థిరబాధ్యత వహించాలని కోరుతూఉండడం సహజమని మా అభిప్రాయం. అందుచేత వారందరూ ఆదివారం ఉపవాసం చెయ్యాలనీ, ఆనాడు స్వగృహాలలోఉండి ప్రార్థనలతో గడపాలనీ విజ్ఞప్తిచేస్తున్నాము. ఆనాటి కలకత్తా ప్రశాంతి శాంతికాముకులైన ప్రజల హృదయపూర్వక ప్రార్థనయగుగాక.'

ఇదివరలో 6 వ తేదీన చెయ్యాలని సూచించిన సురవర్దీ గారుకూడా ఈ మార్పుకు అంగీకరించారు

### భారత యూనియన్ మంత్రివర్గ సమావేశం

పంజాబుపరిస్థితిపై చర్చ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 4: భారతప్రభుత్వ అధినివేశమంత్రివర్గపు నేటి సమావేశంలో, పంజాబుపరిస్థితి చర్చకు వచ్చినట్లు యాధిగా తెలుస్తున్నది.

పంజాబు రాష్ట్ర పర్యటనలో, తాను స్వయంగా చూచిన విషయాలను, పండిట్ నెహ్రూ మంత్రివర్గ సభ్యులకు నివేదించినట్లు తెలుస్తున్నది.

పరిస్థితిని అదుపులో పెట్టడానికి తగిన చర్యలను అవలంబించడంతోపాటు, పంజాబు కల్లోలాలవంటి కల్లోలాలు దేశంలో యితర ప్రాంతాలలో సంభవించకుండా నివారించేందుకు తన కాయశక్తులా కృషి చేయడానికి మళ్లీ పాకిస్థాన్ వెళ్లకుండా ఉండడాని కి గాంధీజీ నిశ్చయించుకొన్నా దాదాపు 7 లక్షల మంది కాందిశీకులకు తగిన రక్షణ సహాయం కల్పించడానికి భారత అధినివేశ ప్రభుత్వం నిశ్చయించుకొన్నట్లు తెలుస్తున్నది.

డాక్టరు
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారి సన్ను
రాజమండ్రి.
(మందులను ప్రసిద్ధముగ తయారుచేయువారు



## ఆంధ్రులకు ప్రత్యేక రేడియోస్టేషన్

### కేంద్ర ప్రభుత్వమునకు మద్రాసు ప్రభుత్వ సూచన

చెన్నపురి, సెప్టెంబర్ 4: మద్రాస్ ప్రభుత్వంవారు, ఈ రాష్ట్రములో త్వరగా క్రొత్తరేడియో స్టేషన్లను నిర్మించుమని కోరుతూ, ఇండియా ప్రభుత్వమువారికి వ్రాయనిశ్చయించినారు. ఇండియా తాత్కాలిక ప్రభుత్వమువారు, అఖండ హిందూస్థాన్ మనస్సులో సంచుకొని, క్రొత్త రేడియో స్టేషన్లు నిర్మాణమునకు ఒక 'ఎనిమిది సంవత్సరముల ప్రణాళిక'ను తయారు చేసినారు. ఈ ప్రణాళిక విభజన జరిగింది కనుక, అమలు జరగుతుందో లేదో తెలియదు. గని ప్రకారం ఆంధ్రులకు ప్రత్యేక రేడియో స్టేషన్, ఈ ఎనిమిది సంవత్సరముల లోపుగా నిర్మాణం చేసేటట్లు తాత్కాలిక ప్రభుత్వంవారు ప్రకటించినారు.

మద్రాసులో గ్రామస్థుల కార్యక్రమములకుగాను ఒక క్రొత్త ట్రాన్స్మిటర్, కాలికట్‌లో మలయాళం కార్యక్రమములకు మరొక రేడియోస్టేషన్ కూడా నిర్మించదల్చుకున్నారు. ఈ ప్రణాళిక మద్రాసు ప్రభుత్వం పరిశీలించి ఆది ఈ రాష్ట్రి పరిస్థితులకు సరిపోదని ఆంధ్రులకు ప్రత్యేక రేడియోస్టేషన్ వెంటనే నిర్మాణంచేయవలెనని, తిరుచునాపలి స్టేషన్ పనికూడా వెంటనే వృద్ధిచేయవలెనని, ఇండియా ప్రభుత్వం వారికి వ్రాయదల్చుకున్నట్లు తెలుస్తున్నది.

ఒకానొకప్పుడు మద్రాసు ప్రభుత్వం వారు తమ ట్రాన్స్మిటర్లు తామే ప్రత్యేకంగా ఏర్పాటుచేసుకునేందుకు గాను ఇండియా ప్రభుత్వమును కోరదలిచారు. ప్రస్తుత ఆర్థికపరిస్థితులవల్లనూ, క్రొత్తరాజ్యాంగ ప్రణాళికలో ఈ సంవత్సరంలో అధికారాలు ఇంకా పూర్తిగా ఇది సిద్ధం అని నిర్ణయించకపోవటంవల్లనూ, ఈసొంత ట్రాన్స్మిటర్లను నిర్మించటం ప్రస్తుతం విరమించుకొన్నారు. ఇప్పుడు ఉన్న రెండు రేడియో స్టేషన్లద్వారా మద్రాసు ప్రభుత్వంవారి జాతీయ నిర్మాణకార్యక్రమానికి కావలసిన కార్యక్రమములు జరపటందుకు ఏర్పాట్లు చేస్తున్నారు.

ఈ సందర్భంలో ఒక ప్రణాళిక ప్రభుత్వమువారి పరిశోధనలో వున్నది.

## రాష్ట్రంలో ధాన్య సేకరణ

### అధికారుల ప్రయత్నం

మద్రాసు, సెప్టెంబర్ 4: ధాన్యసేకరణను ప్రోత్సహించుటకు మంత్రులు, ఆహార శాఖోద్యోగులు జిల్లాలలో పర్యటన చేసిన దానికి ఫలితంగా అభివృద్ధి ఎంత వరకూ కలుగ గలదనే సంగతి వారము లేక 10 రోజులవరకు తెలియదని యీ దినం సివిల్ సప్లయిల కమీషనరు శ్రీ సి. కె. విజయరాఘవన్ గారు పత్రికా విలేఖరులతో ముచ్చటిస్తూ చెప్పిరి. చాలాచోట్ల తాము ధాన్యం బస్తాలు పట్టుకొన్నట్లును, యివిగాక ఉత్పత్తిదార్లు వాగ్దానం చేసిన ధాన్యమును ఉన్నారనియు, వర్షాలు పడుటచేత బాటల పాడైపోవడం ప్రతిబంధకాలు కలిగిన కారణమున యీ ధాన్యము మిల్లులకు చేరటం కష్టముగానున్నదనియు, అవరకు ప్రభుత్వపు ధాన్యపుగిడ్డంగులకు చేరుటకు కొన్ని రోజులు పట్టవచ్చుననియు తెలిపిరి. అధికారులు ఏమాత్రం తమ ప్రయత్నమును సడలించకుండా అన్ని చోట్ల లోను వీలైనంత వరకు ధాన్యమును సేకరించుటకు ప్రయత్నిస్తున్నారని తెలిపిరి. వాంఛితఫలం కలదనే తాము ఆశిస్తున్నామని కూడా అనిరి. ఇంతవరకు అక్టోబరు మాసాంతంలోగా ఆ జిల్లా ఇవ్వవలసిన గిరిష్ట పరిమాణమైన 54000 టన్నుల ధాన్యము కలిపి, మొత్తం 70000 టన్నుల ధాన్యం అక్కడ నుండి రావచ్చునని కమీషనరుగారు అన్నారు.

### అభినవగణేశుడి జననం

ఆగ్రా, సెప్టెంబర్ 2: ఆగ్రాలోని మన్‌టోలాలో ఒక హరిజన కూలిగాని భార్య ఏనుగుతలపోలిన శిశువును ప్రసవించినది. శిశువు కొద్దికాలముమాత్రమే జీవించినది. పలుకొద్దిప్రజలు ఆ శిశువును చూచేందుకు వచ్చారు. అందులో పూర్వవిశ్వాసాల్లో నమ్మకం ఉన్నవారు ఆ శిశువు పార్వతీదేవిగా పరిగణించారు. (ప్లోబ్)

### సవరణ

మొన్నటి (సెప్టెంబరు 3) పత్రికలో పంజాబ్ సరిహద్దుల గ్రామాల ఆక్రమణ వార్తలో 'రెండువందలమైళ్ల పర్యంతం అని ఉండవలసినది బదులు 'రెండు వేలమైళ్ల పర్యంతం' అని పడింది.

## నగరంలో ప్రభుత్వబస్సు సర్వీసు ఏర్పాట్లు

మదరాసు, సెప్టెంబరు 3: మదరాసు నగరమున పూర్తిగా ప్రభుత్వ బస్సులనే నడుపుటకుగాను ప్రభుత్వం చేపట్టియున్న స్కీమును నిర్ధారించి రావలసిన ఏర్పాట్లు చేయుటకు రోడ్డు ట్రాఫిక్ బోర్డు కార్యదర్శి శ్రీ డి. డి. సాతే ఐ. సి. ఎస్. గారి టెవల బొంబాయి వెళ్లి అక్కడ జనరల్ మోటార్సు కంపెనీకి 150 బస్సులు సప్లయిచేయు కంట్రాక్టును యిచ్చి వచ్చియున్నారు. వీటిలో 75 బస్సులకు బొంబాయిలోనే జనరల్ మోటార్సుకంపెనీలో బాడీలు యావత్తూ తయారై పంపబడును. తదుపరి 75 బస్సుల ఇంజనులు మదరాసుకు పంపి సింప్సన్ కంపెనీవారు వాటికి బాడీలు నిర్మిస్తారు. మదరాసునగర బస్సుసర్వీసు యావత్తూ ప్రభుత్వం తీసుకొన్నమీదట నగరంలో దాదాపు 300 బస్సులు నడుపు ఏర్పాట్లను ప్రభుత్వంవారు చేస్తారు. ఇప్పటికి 30 బస్సులు నడుస్తున్నవి కొత్తగా యిపుడు బొంబాయిలో ఆర్డరు చేసిన యీ 150 పెట్రోలుబస్సులుగాక 50 డీసిల్ నూనెబస్సులకు యిదివరకే ఆర్డరు యివ్వబడియున్నది. ఈ కొత్త బస్సులలో అక్టోబరు 15వ తేదీకి వరి 30 బస్సులు సిద్ధమై నడువగలవు. తరువాత వారానికి 10 బస్సులరంతున వస్తూ ఉండును. ఈ కొత్తబస్సులన్నీ 30 ప్రయాణీకులు కూర్చొను వీలునవిగా నుండి కలవు. ప్రస్తుతం మదరాసులో నుండే ప్రైవేటుబస్సులలో ఎన్నిటిని ప్రభుత్వం తీసుకొనుటకు వీలునుసంగతి ధర నిర్ణయ కమిటీ నిర్ణయాలమీద ఆధారపడి యుండును.

## పాకిస్తాను కాందిశీకులకు

### మదరాసు ప్రభుత్వం 1 లక్ష సహాయం

మదరాసు, సెప్టెంబరు 3: పాకీస్తాను నుండి పారివచ్చు శిక్కులు హిందువులసహాయార్థం రు 1 లక్ష యిచ్చుటకు మదరాసు ప్రభుత్వంవారు నిశ్చయించిరి. ఈపని జరుపుటకు ఒకస్పెషల్ ఆఫీసరును ప్రత్యేకోద్యోగిగా నియమించుతురని తెలియుచున్నది. ఏ విధమగు సహాయం చేయవలసింది నిన్న సాయంకాలం మంత్రులు సమావేశమయి నిర్ణయించిరి. ప్రజలుకూడా యీ కాందిశీకులకు సహాయం చేయగోరుచు, షెరీఫ్ గారిచే ఒక బహిరంగ సభ 10వ తేదీన ఏర్పాటు చేయించుటకు నిశ్చయించిరి.

ఆప్రుడే 10 మంది సుచేతా కృపలాని ఆధ్వర్యంలో మదరాసు వచ్చియున్నారు. పంజాబీసంఘనాయకులు శెఫ. కర్ణ. గిల్లు గారు వారి విషయం ప్రధానితో నిన్న సంప్రదించిరి.

ఎంతమందిని ఎపుడు పంపించేది వారి కెట్టి సహాయం కావలసింది ఇండియా ప్రభుత్వం వారు ముందుగ తెలియజేతురు. 10000 మందికి ఆశ్రయ మిస్తునని ప్రధాని యిదివరకు వాగ్దానం చేసెను.

రామస్వామి మొదలియారు సత్రంలో ప్రస్తుతం వచ్చినవారికి ఆశ్రయ మొసంగబడెను.

### 'ప్రజాశక్తి' పై ధరావతు రద్దు చేయాలని పిటిషన్

చెన్నపురి, సెప్టెంబరు 3: ప్రజాశక్తి అను కమ్యూనిస్టు దిన పత్రికను రు 2000 ధరావతు చెల్లించవలెనని ఇటీవల మద్రాసు ప్రభుత్వం జారీ చేసిన ఉత్తరువును రద్దుపరచ వలసిందని కోరుచూ ఆ పత్రిక సంపాదకులు శ్రీ రాజగోపాల రావుగారు హైకోర్టులో పిటిషన్ పెట్టినారు. గత మార్చి, జూలైమాసాలలో ఆ పత్రిక కొన్ని ఆక్షేపణీయము లైన వ్యాసములను ప్రచురించినను హేతువు పై మద్రాసు ప్రభుత్వం రు 2,000 ధరావతును ఆగస్టు 25 లోగా కట్టవలెనని పత్రికా సంపాదకునికి ఉత్తరువు చేసింది.

### సంగీతంనేర్చుకొనుటకు షెడ్యూల్ జాతి బాలికలకు ప్రభుత్వ సహాయం

మదరాసు, సెప్టెంబరు 3: సంగీతం నేర్చుకొను ఉద్దేశంగల షెడ్యూల్ జాతి బాలికలకు నివాసభృత్యాలతో సంబంధంలేని ఉపకార వేతనములిచ్చుటకు కార్మిక కమీషనరుకు ప్రభుత్వంవారు అధికారం యిచ్చియున్నారు. మదరాసు యూనివర్సిటీ సంగీత పట్ట పరీక్షకు తర్ఫీదుపొందు షెడ్యూలుజాతి బాలికలకు సాలుకు రు 30 యిస్తారు. ఈశిక్షణ రెండేండ్లకాలంపాటును. అణ్ణామలై విశ్వవిద్యాలయ సంగీతభూషణ పట్టపు నాలుగేండ్ల విద్యాభ్యాసానికి మొదటిమూడు రూ 15 తదుపరి మూడేండ్లకు సాలుకు రూ 14 వంతునను మదరాసు ఉపాధ్యాయుల సంగీత కళాశాలలో తర్ఫీదు పొందదలచేవారికి రూ 27 వంతుననూ షెడ్యూలుజాతి బాలికలకు ఉపకారవేతనము లివ్వబడును. అర్హులగు పిల్లలకు నివాస ఖర్చులుకూడా యివ్వబడును.

## యూరోపియన్ శాసన సభ్యులకు స్వస్తి

మద్రాసు, సెప్టెంబరు 3: రాష్ట్రీయ శాసనసభలు, కౌన్సిళ్లలో ఇంతవరకూ ఉంటున్నటువంటి యూరోపియనులకు సభ్యత్వము తీసివేయబడినది. మద్రాసు శాసనసభలో మిగిలిన యూరోపియన్ సభ్యులు డి. ఎల్‌బర్ట్, పెల్లియా టి. విలియమ్స్, యఫ్. పెర్రెల్ గారలు. వీరు శాసనసభలో ఇకనుంచి కూర్చొనకూడదు. కాబట్టి చెన్నరాష్ట్ర శాసనసభ సంఖ్య 212 మాత్రమే అగును.

మద్రాసు కౌన్సిలులో సర్ జేమ్స్ డా అను ఒక్క సభ్యుని తీసివేసినారు. ఒక కౌన్సిలు స్థానము ఇంతకుముందే ఖాళీ అయినది. అందుచే కౌన్సిలు సంఖ్య ఇప్పుడు 52.

## గవర్నర్ల అధికారములు

భారత స్వాతంత్ర్యోదయ ఫలితముగానూ, ఇంకనూ భారతరాజ్యాంగ నిర్మాణము పూర్తికాకుండుటచే తాత్కాలికముగా చేయబడిన "అడాప్టేషన్ ఆర్డరు" ప్రకారము గవర్నరుకు ఎట్టి ప్రత్యేక బాధ్యతలునూ లేవు. 1935 చట్టమునుంచి, గవర్నర్లకు ప్రత్యేక బాధ్యతలు అనుపదము తొలగించివేసిరి. మంత్రులను సంప్రదించి, వారి సలహాపైననే గవర్నరు ప్రవర్తించవలెను. కొన్ని అసాధారణ సందర్భములలో, గవర్నర్-జనరల్ సలహాపై, గవర్నర్ ప్రత్యేకాధికారములను చలాయించవచ్చును. శాసనసభలు చేసిన నిశ్చయములకు, ఈ తాత్కాలిక చట్టం ప్రకారం గవర్నర్, గవర్నర్ జనరల్, లేక రాజుయొక్క అనుమతితో అవసరము లేదు.

## కార్పొరేషను యిండ్లు నీటి సప్లయి

మదరాసు కార్పొరేషను వారు నిర్మిస్తున్న షినాయినగరు యిండ్లు, నీటిసప్లయి వృద్ధిచేయటకు రెడిహిల్సు చెరువునుండి కీల్పాకువరకు కట్టనున్న రెండవ సిమెంటు కండూటు, పత్రికా ప్రతినిధులకు బుధవారంనాడు కమిషనరు నరసింహం గారు స్వయంగా చూపిరి.

షినాయి నగరులో (అంజికరై) ఎ. బి. సి. డి. తైపు వాల్లరకాల యిండ్లు కట్టుచున్నారు. మొత్తం 900 అందు ఎ—8, బి—6, సి—25, డి—47 ఇండ్లు ముందుగ కట్టుట ప్రారంభించిరి. అన్నిరకాల సదుపాయాలు వాటికి చేకూర్చనున్నారు. సి. తైపుయిల్లు 2 గ్రౌండులలో 1530 చ. అ. చప్టావిస్తీర్ణం కలిగి, మేడతోకూడి యుండును. నెల అద్దె రు 66, ఖరీదు రూ 14000 డి. తైపు యిల్లు $1\frac{1}{2}$ గ్రౌండులలో 1080 చ. అ. చప్టా కల్గి మేడతో కూడ్య, నెల అద్దె రూ 58. ఖరీదు రూ 12,000 ఎ. బి. తైపు ఇండ్లు కార్పొరేషను ఉద్యోగులకు యిస్తురు, తక్కినవి బయటవారికిస్తురు. ప్రస్తుతం డ్రయినేజి ఏర్పాటులు జరుగుచున్నవి.

ప్రస్తుతం మదరాసునకు నీటి సప్లయి రెడుహిల్సు చెరువునుండి క్రిల్పాకువాటరు వర్క్సువరకు $7\frac{1}{2}$ మైళ్ల పొడుపున 5 అ. వెడల్పు 4 అ. లోతుగల సిమెంటు కాల్వగుండా దినమునకు 230 లక్షల గాలనులు, అందుచున్నది. ఇది 1914 లో కట్టబడినది. నగరానికి నీరు చాలనందున దానిప్రక్కనే మరో కండూటు కాల్వ 6-6 వెడల్పున 4 అ. ఎత్తుటాపున ఆర్చికప్పుతోగూడ కట్టుటకు రూ 39 85 లక్షలు 1946 జనవరిలో మంజూరయినది. దీన్ని వాల్లభాగాలుచేసి నల్గురు కంట్రాక్టరులకిచ్చి, పని త్వరగ చేయించుచున్నారు. ఈ సాలాంతమునకది పని పూర్తికాగలదు. అపుడు దినమునకు 550 ల. గాలనులు సప్లయి కాగలదు.

1000 మంది పనివారు ఎర్రచెరువుగట్టు యీ కాల్వ మొదలుగట్ట పనిచేయుచున్నారు. వర్షకాలంకప్తె చెరువునుండి ఆచోట పని సాగదని తొందరగ చేస్తున్నారు కాని, 8 అ. రేసుసు చాలక బాకీ రాగులయినా యిచ్చనందున, కూలీలు స్థిరంగా పనిచేయలేదు.

## స్థానిక సంస్థలకు రేడియోసెట్లు

చెన్నపురి, సెప్టెంబర్ 4: రాష్ట్రములో దాదాపు 6000 స్థానికసంస్థలు, ప్రజాసంస్థలు రేడియోసెట్ల అవసరమును కలిగియున్నవి. వీటిని చౌకగా తయారుచేయించి, ఈ సంస్థలకు పంచిపెట్టుటకు ఎంతవరకు ఆర్థికముగా వీలగునో ప్రభుత్వము ఆలోచించుచున్నది. ఈ సందర్భమున ఆర్థిక మంత్రి గోపాలరెడ్డిగారు రేడియో స్టేషన్ ఆఫీసర్ శ్రీ కాశీపతిగారితోను, రేడియో ఇంజనీర్ శ్రీ జోగారావు గారితోనూ సంప్రదింపులు జరుపుచున్నారు. ఈదినం మధ్యాహ్నం మంత్రిగారు రేడియో పారిశ్రామిక లేబరేటరీలను పరీక్షించిరి.

### మోటారు రవాణా లాభంలో ప్రజలకు వాటా

చెన్నపురి, సెప్టెంబరు 4: అక్టోబరు 1947 నుంచీ ప్రభుత్వం మోటారు రవాణాను స్వాధీనపరుచు కొనుచున్నందువల్ల గతల లాభములో నూటికి 20 వంతులను కార్పొరేషనుకు ఇవ్వగలరని ప్రభుత్వం తెలియపరిచిరి. ప్రభుత్వం అధీనంలోను కొన్ని తగ్గాయకమూడా పెట్టుబడిలో వ్యాపారులకు భాగం ఉంటుంది అందువల్ల తరువాత నుంచి చెన్నపురిలో మోటారు రవాణాకు మద్రాసు మోటారు బస్ సర్వీసు అనుపేరు పెట్టగలరు.

### చూలై క్లాక్ టవర్

చెన్నపురి, సెప్టెంబరు 4: చూలైలో క్లాక్ టవర్ నిర్మాణం నిమిత్తం రు 3200 ను, సైదాపేటలో కార్పొరేషన్ స్కూలు షెడ్డులు నిర్మించుటకు ముత్తం రు 52,500 ను కార్పొరేషన్ కమీషనరు ప్రతిపాదనపై గ్రాంటుచేయబడినది.

## లాకాలేజి ఆంధ్రవిద్యార్థి సంఘం

చెన్నపురి, సెప్టెంబర్ 4: మాతృభాషలు దేశమైకత్య మాత్రమున మానవత్వములో భేదము రాకూడదు. ఎవరిభాష వారు మాట్లాడుకొనుటను ఎవ్వరును ఆక్షేపించరాదు. ప్రాంతముల భేదమునుబట్టి ఒక భాష. ఆనేక విధములుగా మాట్లాడబడవచ్చును. ఆక్షేపణీయమునూ కాదు. అంత మాత్రముచే భేదాభిప్రాయములను కలుగచేసుకొనుట తప్పు. విద్యార్థు లందరు కలిసిమెలిసి ఉండవలెను; అని శ్రీ గోవిందరాజులు గారు లా కాలేజి ఆంధ్ర విద్యార్థి సంఘపు ప్రారంభోపన్యాస సందర్భమున ప్రసంగించుచూ చెప్పిరి. శ్రీ వెంకటేశంగారు అధ్యక్షత వహించిరి. న్యా॥ పత్తిపాటి సత్యనారాయణగారు ప్రారంభోపన్యాస మిచ్చుచూ విద్యార్థులకు చాలా విశ్రాంతియుండును. కాన మీరు సత్ప్రవర్తన, విజ్ఞానములను పెంపొందించు కొనవలెనిరి. అదికాక న్యాయవాదులకు అనేకరకములైన శక్తియుక్తులతో పరిచయం, కలయిక ఏర్పడుతుంది. కాబట్టి వ్యక్తిత్వాన్ని గూర్చి తెలుసుకోటానికి వీలవుటుంది. దానివలన విశాల భావాలు కలగటానికి అవకాశ మేర్పడుతుంది. అలాంటివారు నాయకత్వాన్ని స్వీకరించటానికి అర్హులవుతారు. మన విద్యావిధానం చాలా లోపభూయిష్టంగా వుంది. ఇన్ని కాలేజీలు పెట్టి ఇంజనీరింగ్ కళాశాలలు స్థాపించి, మన యువకులు చదువుతున్నారు. తీగా రామపాదసాగర నిర్మాణమంటూ వచ్చేటప్పటికి, అమెరికా ఇంజనీర్ల సహాయం కావాల్సి వచ్చింది. మన దేశం అభివృద్ధి చెందాలి. "ఇప్పటికి రెండు యుద్ధాలు జరిగాయి. మానవుల్ని చంపటం, ఆస్తి నష్టం జరిగాయి. ఈ పనులు భారతీయులు చేసినవి కావు. విజ్ఞానం, సంపద, అధికారం తమచేతుల్లో ఉన్నదనుకునే పాశ్చాత్యులు చేసిన చర్యలు రెండవ యుద్ధం అయిపోయింది. విజయం లభించింది, కాని శాంతి రాలేదు. ఇది పరస్పర విరోధంగా వుంది. దీనికంతా కారణాలున్నాయి. మనం రోక్కాలు చంపుకోవాల్సిన టామ. కాని పాశ్చాత్యుల ఆర్థిక శాస్త్రం, నిర్మాణం రోక్కాలతోనే ప్రారంభించింది. రోక్కాల ఫలితం ఉత్పత్తి ఉత్పత్తికలన దురాశలుపుట్టి, ఆస్తిన వినాశనం, యుద్ధం బయల్దేరుతున్నాయి. మనకు స్వతంత్రం వచ్చినా మన కష్టాల్లో ఏమార్పు కలుగటంలేదు. కారణం 150 ఏండ్లనుంచి బ్రిటిషువారు మనదేశంలో అవలంబించిన ఆర్థిక విధానమే ఇప్పుడు మనం అంతా ప్రజాస్వామ్య ప్రాథమికాంశ్యతగా బాధ్యతలో నాయకుల్ని అనుసరించాలి" అన్నారు, శ్రీ సత్యనారాయణగారు.

## మద్రాసు రేడియో

### ఆదివారం సెప్టెంబరు 7

మద్రాసు: 2. ఉ॥ 7-0 స్వాగతం 7-10 తెలుగులో వార్తలు. 7-20 వాద్య సంగీతం 7-30 సినీమాపాటలు 8-0 ఇంగ్లీషులో వార్తలు. 8-15 సినీమాపాటలు. 8-30 హాస్యవల్లరి (తెలుగు) 9-0 వాద్య సంగీతం 9-10 పరిత్యాగం (మలయాళం నాటిక) 9-30 ముగింపు.

మ॥ 12-30 రికార్డులు. 1-0 ఆర్కెస్ట్రా 1-30 ఇంగ్లీషులో వార్తలు. 1-40 రికార్డులు. 2-0 దిల్ రుబా 2-5 తెలుగులో వార్తలు. 2-10 దిల్‌రుబా 2-15 పిల్లలకు (తెలుగు) 3-0 యం. బాలమురళీకృష్ణగానం 4-0 రికార్డులు 5-0 ముగింపు.

సా॥ 5-30 వి. విశ్వనాథన్ గానం 6-0 ఇంగ్లీషులో వార్తలు. 6-10 స్థానిక ప్రకటనలు. 6-20 లోకవార్త (మలయాళం) 6-30 గ్రామస్థులకు (తెలుగు) 7-15 తెలుగులో వార్తలు. 7-30 వాచన 7-45 నోరి నాగభూషణం కీర్తనలు. 8-30 కె. గోమతీదేవి 9-0 ఇంగ్లీషులో వార్తలు. 9-15 ఇంగ్లీషు ప్రసంగం 9-30 వై. ఎస్. శ్రీనివాసమూర్తి గానం. (మద్రాసులో బి. బి. సి. వార్తలు.) 9-40 రికార్డులలో ఆంగ్లసంగీతం 10-30 ముగింపు.

# కిసాన్ మజ్దూర్ ప్రజాపక్ష కార్యదర్శి చెన్నారెడ్డిగారి అరెస్టు

## చంచల్‌గుడా సెంట్రల్ జైలులోని సత్యాగ్రహుల నిరశనదీక్ష

['ఆంధ్రపత్రిక' విలేఖరి]

హైదరాబాద్, సెప్టెంబర్ 5: ఈ నగర కాంగ్రెస్ కార్యదర్శి, కిసాన్ మజ్దూర్ ప్రజాపక్షం కార్యదర్శి అయిన డాక్టర్ చెన్నారెడ్డిగారిని, నిన్న సాయంత్రం, హైదరాబాద్ రక్షణ నిబంధనల ననుసరించి అరెస్టు చేశారు.

అరెస్టు అవడానికి ముందు శ్రీ రెడ్డిగారి దిగువ ప్రకటన చేశారు: సర్వాధికారము ప్రజలదే అనే శకం ఇది. హైదరాబాద్ ఇందుకు అపవాదంగా నిలవజాలదు. ఆశయసిద్ధికోసం నిరీక్షిస్తుండడమే ఎవరైనా చేయవలసినపని. కిసాను, మజ్దూరులు అవిద్యతో, ఆకలిమంటలతో, దుఃఖరజీవితం గడుపుతూండడం హైదరాబాద్‌కు పెద్ద కళంకం. నేను ఆడీసాంతం హైదరాబాదీని హైదరాబాదీలు స్వతంత్రం కోసం పోరాడి, త్యాగంచేసి, బానిసబ్రతుకు ఈ కళంకాన్ని కడిగివేస్తారని నమ్ముతున్నాను. ఫేసిస్టు దమననీతి, నిరంకుశత్వం, గూండాతనం ఏవీకూడా నిర్భీతి బుద్ధితో జరిగే ఈ శుద్ధి సమరాన్ని అణిచివేయజాలవని స్పష్టపరుస్తున్నాను. కాంగ్రెస్‌వాదు లందరూ, ప్రియతములైన బాపూజీ చూపిన సత్యాహింసల మార్గాన్ని అనుసరించి, కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్యస్థాపనకు కృషి చేయాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

### చంచల్‌గుడా సెంట్రల్ జైల్లో సత్యాగ్రహుల నిరశనదీక్ష

చంచల్‌గుడా సెంట్రల్ జైల్లో నిర్బంధితులైన సత్యాగ్రహులు సెప్టెంబర్ 1-నుంచీ నిరశనదీక్ష ప్రారంభించినట్లు విశ్వసనీయంగా తెలియవచ్చిందని సంస్థాన కాంగ్రెస్ కార్యాలయంవారు ప్రకటించారు. ఆ ప్రకటనలో ఇంకా ఈ అంశాలువున్నాయి. ఆ సెంట్రల్ జైలులోని సత్యాగ్రహులు 15 రోజులక్రితం తమకు సరియైన భోజనం ఏర్పాటు చేయవలసిందనీ, పత్రికలు సప్లయి చేయవలసిందనీ జైలు అధికారులను కోరారు. ఆగస్టు 31-వ తేదీవరకూ వారి కోరికలు నెరవేరడం కానీ సమాధానంరావడంకానీ జరుగలేదు. దానిమీదట వారంతా సెప్టెంబరు 1-నుంచీ నిరశన దీక్షకు పూనుకొన్నారు.

### పరకాల సంఘటన

సంస్థానకాంగ్రెస్ వృత్తాంతం

కరీంనగరంజిల్లాలో సెప్టెంబర్ 2-న జరిగిన సంఘటన విషయమై సంస్థాన కాంగ్రెస్ ప్రచారకార్యాలయానికి ఈ దిగువ వృత్తాంతం తెలియవచ్చింది:

ఆరోజున అక్కడపోలీసులకాల్పులవల్ల 15 మంది తక్షణమే చనిపోయారు. దాదాపు 100 మంది గాయపడ్డారు.

పరకాల పరిసరగ్రామలప్రజలు వందల సంఖ్యలో ఆరోజున ఆపట్టణంలో జరిగే భారతపతాక వందనోత్సవం సందర్శించడానికి వెళ్లారు. వారు పట్నంలో ప్రవేశిస్తూండగా రిజర్వుపోలీసులు సాయుధ ముస్లిములసాయంతో వచ్చి సమూహంపై కాల్పులు జరిపారు. గాయపడినవారిలో కొంతమందిని, పరకాలఆస్పత్రిలో చావులేక వరంగల్లు ఆస్పత్రికి తీసుకువెళ్లారు. 150 మైచిలుకు మందిని అరెస్టుచేశారు. పట్నంచుట్టూరా సాయుధ పోలీసులను కాపలా ఉంచారు.

### భారతపతాక ఆవిష్కరణోత్సవం

నిజాంసంస్థాన కాంగ్రెస్ కార్యాచరణ సంఘం ఆదేశానుసారం సెప్టెంబర్ 2 న ఆయాచోట్ల జరిగిన భారతపతాకావిష్కరణోత్సవాల వివరాలు:

ఖమ్మంమెట్టు

ఇక్కడ ప్రభుత్వ పి. డబ్ల్యు. డి. ఆఫీసుపైనా, స్టేటుబాంకుపైనా భారత పతాకలు ఎగురవేయబడినాయి. గస్తీ తిరిగిన రిజర్వు పోలీసులు ఆ పతాకలనూ, ఇతర భవనాలపైన ఎగిరిన వాటినీ స్వాధీనం చేసుకొన్నారు. డాక్టరు రామచంద్రరావు, కాప్ప పుల్లయ్యగార్లను పోలీసులు కస్టడీలోకి తీసుకొని ఒక గంట తర్వాత వదిలిపెట్టారు. (ఇంకా వివరాలు ఈ పత్రికలో ఇదివరకే ప్రకటితమైనాయి.)

మధిర

ఇక్కడ ఆరోజు ఉదయం భారత పతాకాన్ని ఆవిష్కరించినందుకు స్థానిక ఉద్యోగులు, పోలీసులు పేరెళ్ళ వీరయ్య, బెల్లంకొండ రాములు, ఉత్కృష్టయ్య, కొణతం రామకోటయ్యగార్లతో మొత్తం 11 మందిని అరెస్టుచేశారు. సాయంత్రం మళ్లీ, ఈ చుట్టుపట్లవున్న దెందుకూరు, మడిపల్లె, అల్లీనగరం, మాదేపురం గ్రామాలనుండి చాలామంది వచ్చి పింగిలివారి ఫాక్టరీకి ఎదురుగా పతాకం ప్రతిష్ఠించారు.

మానుకోట

ఇక్కడ శ్రీరామకృష్ణగారు పతాకాన్ని సలాంఛనంగా ఎగరవేసినారు. పోలీసులు పతాకాన్ని దించవలసిందిగా శ్రీరామకృష్ణగారిని బలవంతపరచినారు. వారు నిరాకరించారు. ఒక పోలీసు కానిస్టేబిల్ పతాకాన్ని తీయ నిరాకరించాడు. వేరొక కానిస్టేబిల్ ఆ పతాకాన్ని దించగా, స్వాధీనంచేసికొని శ్రీరామకృష్ణగారిని అరెస్టుచేసి కొంతకాలం తమ వశంలో ఉంచుకొని తరువాత విడుదల చేసినారు. ఇల్లెందులో సలాంఛనంగా ఎగురవేయబడిన పతాకాన్ని పోలీసులు స్వాధీనం చేసుకున్నారు.

జనగామ బీటుబజారులో ఎగురవేసిన పతాకాన్ని పోలీస్ సబ్‌ఇన్‌స్పెక్టరు తీయించివేసినారు.

## 'విద్యార్థులను హింసించినమాట అబద్ధం'

నిజాంప్రభుత్వ ప్రకటన

సెప్టెంబరు 2 న భారత యూనియన్ పతాకను పుచ్చుకొని వెడుతున్న కొందరు విద్యార్థులను పోలీసులు అరెస్టుచేసి, హింసించినట్లు ప్రకటితమైనవార్త అబద్ధమంటూ నిజాంప్రభుత్వం 3 వ తేదీన ఒక ప్రకటన చేసింది:

చట్టాన్ని ఉల్లంఘించి ప్రవర్తించినందుకు మగ్గురు నలుగురిని అరెస్టు చేసిన మాట వాస్తవమేననీ, తర్వాత వారు విద్యార్థులని తెలిసిందనీ, అయితే వారిని పోలీసులు హింసించారన్నదీ, భారత సమాఖ్య పతాకను పోలీసులు అవమాన పరిచారన్నదీ శుద్ధ అబద్ధమనీ, ఆ విద్యార్థులను తరువాత, ఎట్టి చర్య తీసుకోకుండానే వదిలిపెట్టడమైందనీ ఆ ప్రకటనలో వుంది.

## మంత్రుల విమర్శలు

### నిజాం నవాబుగారి ఖండన

హైదరాబాద్, సెప్టెంబర్ 3: నిజాం సంస్థానప్రధాని ఛత్తారీనవాబు, రాజ్యాంగ సలహాదారు సర్ వాల్టర్ మాంక్టన్ గార్లు సంస్థానంతరఫున ఢిల్లీలో భారతప్రభుత్వంతో సంప్రతింపులు జరిపిన సందర్భంలో అవలంబించిన వైఖరిపై వచ్చిన విమర్శలను ఖండిస్తూ నిజాంనవాబుగారు నిన్న నొక ఫర్మానా జారీచేశారు.

ఆ సంప్రతింపులు జరిగినంతకాలమూ ప్రధాన మంత్రిలోనూ, రాజ్యాంగ సలహాదారులోనూ తమకు పూర్తివిశ్వాసం ఉన్నదనీ సంస్థానంతరఫున భారతఅధినివేశప్రభుత్వంతో తిరిగి వెంటనే సంప్రతింపులు ప్రారంభించవలసిందని తాము వారిని కోరారనీ నవాబుగారు ఫర్మానాలో ఉద్ఘాటించారు.

తమ తరఫున సంప్రతింపులు జరుపడానికి తగినవారిని ఎంచుకొనే అధికారం తమదేనని అట్టి వారిపై వచ్చేవిమర్శలను ఇకమీదట ఎంతమాత్రమూ సహించడం జరగదనీ నవాబుగారు ఉద్ఘాటించారు.

సంస్థానంతరఫున సంప్రతింపులలో పాల్గొన్న రాజ్యాంగవ్యవహారాల మంత్రి నవాబ్ అలీయావర్‌జంగ్ గారిని గురించి నవాబుగారి ఫర్మానాలో ప్రత్యేకించి ఏమీ లేదు. ప్రధాని, సర్ వాల్టర్ గార్లతోపాటు నవాబ్ అలీయావర్‌జంగ్ గారు కూడా రాజీనామా నిచ్చినట్లు లోగడ తెలిసినవిషయం.

### మంత్రులలో అవిశ్వాస తీర్మానోపసంహరణ

ఇత్తెహాదుల్ ముస్లిమీన్ సభ్యులు కొందరి యత్నం

[స్వకీయ విలేఖరి]

హైదరాబాద్, సెప్టెంబరు 3: నిజాం సంస్థానం తరఫున భారత అధినివేశంతో సంప్రతింపులు జరిపే సంప్రతింపుల సంఘ సభ్యులయిన ప్రధాని ఛత్తారీ నవాబు, రాజ్యాంగ సలహాదారు సర్ వాల్టర్ మాంక్టన్, రాజ్యాంగ వ్యవహారాలమంత్రి నవాబ్ అలీయావర్‌జంగ్ బహదూర్ గార్లలో తమకు విశ్వాసంలేదని అంజుమన్ ఇత్తెహాదుల్ ముస్లిమీన్ గత మాసంలో ఒక తీర్మానం చేసినసంగతి తెలిసినదే.

ఇటీవల ఆ సంస్థ స్థాయిసంఘ సభ్యులు 38 మంది, ఆ తీర్మానాన్ని ఉపసంహరించాలని, అందునిమిత్తం ఈ నెల 10-వ తేదీలోగా స్థాయిసంఘ సమావేశం ఏర్పాటు చేయాలని అధ్యక్షునికి నోటీసు ఇచ్చారు.

## గౌరవంగా ప్రజలకోర్కెలు తీర్చండి

ప్రధానికి వైద్యాగారి లేఖ

కాశీనాథరావు వైద్యగారు సెప్టెంబర్ 2 న తాము సత్యాగ్రహం చేయదలుచుకొన్నట్లు తెలుపుతూ నిజాంప్రభుత్వప్రధానికి ఈ దిగువలేఖ వ్రాశారు. "నిజాం సంస్థానం భారతసమాఖ్యలో చేరాలనీ, బాధ్యతాయుతప్రభుత్వం ఏర్పాటుచేయాలనీ సంస్థానకాంగ్రెస్ కోరింది. కాని ప్రభుత్వం వేరేమార్గం అనుసరించుతోంది. నిజాంసంస్థానం ముస్లింసంస్థానమని చెప్పి ముస్లిములను వంచించి వారిలో హిందువులపై విద్వేషం రగుల్కొల్పుతోంది. ఇప్పుడు ముస్లిములను, ముఖ్యంగా ఇత్తెహాదుల్ ముస్లిమీన్ సంస్థను, స్వప్రయోజనార్థం వినియోగించుకొంటూ, నిజాం సంస్థానం భారత సమాఖ్యలో చేరితే ముస్లిములకు కష్టం కలుగుతుందని ప్రపంచానికి చాటడానికి ప్రయత్నిస్తున్నది. ఈనాడు ఇల్లా లాలింపబడుతోన్న ఈ ఇత్తెహాదుల్ ముసల్‌మీను సంస్థే ముందుముందు వశం తప్పి ప్రభుత్వానికీ, నవాబుకూ ప్రమాదకరంగా పరిణమించగలదని స్పష్టపరచ తలుస్తున్నాను.

సంస్థానం భారతసమాఖ్యలో చేరడం, బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పరచడం జరిగేవరకూ ప్రస్తుత పోరాటం ఆగదు. దీనిని అణచివేయడానికి ప్రభుత్వంచేసే ప్రయత్నాలన్నీ విఫలమయి తీరుతాయని చరిత్ర చెప్పుతున్నది. కనుక ప్రభుత్వం ముందుగానే గౌరవంగా ప్రజలకోరికలు నెరవేర్చి, సంస్థానాన్ని విషమపరిణామాల నుంచి రక్షించడం మేలు, ఏ మాత్రం జాప్యంజరిగినా, ప్రజలు లెవీ, పన్నులూ చెల్లించడం మానివేసే పరిస్థితి కలగవచ్చును.

## యూనియన్ ప్రజలపై నిజాంపోలీసు జులుం

మద్రాసు హోంమంత్రి పరిశీలిస్తారట

చెన్నపురి, సెప్టెంబరు 4: యూనియన్ ప్రజలపై నిజాం పోలీసులు అత్యాచారాలు చేస్తున్నారు. మద్రాసుప్రభుత్వ పాలనలోవున్న ప్రజలకు కొందరికి, నిజాం ప్రదేశాలలోనుంచి రాకపోకలు చేయక తప్పటంలేదు. ముఖ్యంగా లింగగిరి ప్రజలకు, పరిటాలమీదుగా ప్రయాణం చెయ్యవలసిన ప్రజలకు నిజాం పోలీసుల అత్యాచారాలు దిన దినం కష్టాలు తెచ్చిపెడ్తున్నవి. పైగా నిజాం పోలీసులు ఆయుధాలు ధరించి, యూనియన్ ప్రదేశాల్లోంచే విహారాలు చేస్తున్నారు. మద్రాసు ప్రభుత్వంవారు ఈ విషయమై ఏంచేస్తున్నారు అని హోంశాఖా మంత్రి డా॥ సుబ్బరాయన్ గారిని 'ఆంధ్రపత్రిక' విలేఖరి అడుగగా 'ఆవిషయాలు యూనియన్ ప్రభుత్వం చూడవలసినవి. మద్రాసుకు సంబంధించినంతవరకు ఏమైనా జరిగివుంటే తప్పక పరిశీలిస్తాము, అన్నారు.

## మదరాసు ధరలు

మదరాను, సెప్టంబరు 5:

వేరుసెనగ: (531 పా 1-కి ఎక్స్ కోస్తా గిడ్డంగులు) మెషీన్ (సేల్స్‌టాక్సు తోసహా) పప్పు బజారు 140-0-0

ఇంగ్లీషుకాండి (500 పౌనల గలది) 1-కి ఆఫీసు 143-0-0

వేరుసెనగనూనె: ఎక్స్‌పెల్లర్ (సేల్స్‌టాక్సుతో సహా) మదరాసు, బజారు వెల 300

ఆముదం మిల్ డెలివరి ఎక్స్‌పెల్లర్ పర్ ఇంగ్లీషుకాండి 500 పౌనులు గలది రు. 340.

కొంకాయనూనె (38 పౌను గల డబ్బా. వెల 29-8-0)

## న్యూయార్కు దూది

న్యూయార్కు, సెప్టెంబరు 4: అక్టోబరు 31.42/31.44 డిశంబరు 31.17/31.17 జనవరి 31.13/ సా॥ మార్చి 31.10/31.10 మే 30.74/30.74 జూలై 30.05/30.07 అక్టోబరు 28.22/28.30 డిసంబరు 27.79/ నా..

| | |
|---|---|
| మిడ్లింగ్ హాజరు | 32.55 |
| అక్టోబరు (గరిష్ఠధర) | 31.60 |
| (కనిష్ఠధర) | 31.25 |

అక్టోబరు వాయిదా ధరలు

| | |
|---|---|
| నేటి ప్రారంభం వెల | 31.32 |
| నిన్న | 31.35 |
| ,, ముగింపు వెల | 31.42 |
| నిన్న | 31 25 |



## నోటీసు

విశాఖపట్టణము డి॥ ము॥ కోర్టులో

O. S. 204/47.

వాది: కేదారిశెట్టి శంకరసూర్యనారాయణ.

ప్రతివాదులు: (1) మీసాల నారాయణ, (2) యీ ముత్యాలు, (3) యీ అప్పన్న జ్న 3 రు. ఖాంగోగల్లీ, రంగూను.

ప్రతివాదులకు దావా నోటీసు.

వాదికి మీరున్ను 2,3 ప్రతివాదుల తండ్రిన్ని వ్రాసిన 14-7-31 తేదీ గల తనఖాపత్రము బాకీ రు 290-0-0 లు రాబట్టే నిమిత్తము వాదిమీద తెచ్చిన పై నెంబరు దావా 16-9-1947 తేదీకి వాయిదా గాన ఆ రోజున పగలు 10 గంటలకు హైకోర్టువారి యెదుట హాజరై మీ ఆక్షేపణలను తెలుపనిచో, మీపైని ఎక్సుపార్టీ డిక్రీ పొందడమువును.

గణపతిరాజు చంద్రశేఖరరాజు, వాది అడ్వోకేటు.

2-9-47. విశాఖపట్నం.

## మద్రాసు ప్రావిన్షియల్ వెల్‌ఫేర్ ఫండు

లేడీ నై విజ్ఞప్తి

ఈ నిధికి గాను విరాళములను విరివిగా నివ్వవలసిన దని ఉదార మనస్కులైన స్త్రీ పురుషు లందరిని మనఃపూర్వకము గా కోరుచున్నాను.

ఈ నిధిని యేర్పాటు చేయుటకు గల ముఖ్యోద్దేశ్యము అభ్యుదయ కార్యములకు గాని యేదైన సాంఘిక ప్రయోజనములకు గాని అనగా ఆస్పత్రులు, కానుపుల కేంద్రములు, శిశుసంరక్షణ కేంద్రములు, శిశుపోషణశాలలు, ఆర్తులకు రక్షణనివాసములు మున్నగు సత్కార్యములకు తోడ్పడుటయే. ఈ నిధిని ప్రముఖ పౌరులు గల ఒక సెంట్రల్ కమిటీవారు నిర్వహింతురు. జిల్లాలలో దీనికి అనుబంధముగా కమిటీలు యేర్పాటగును.

విరాళములు నాకు గాని, ట్రెజరరు, శ్రీ కే. ఎం. నంజప్ప, ఇంపీరియల్ బ్యాంకు ఆఫ్ యిండియా, హెడ్డాఫీసు, మద్రాసుకు గాని పంపవచ్చును.

## స్వాతంత్ర్య దినమున స్థానిక ఆయుర్వేద వైద్యుల సమావేశము

నరసారావుపేట, సెప్టెంబరు 2: స్థానిక ఆయుర్వేదవైద్యులు ది 15-8-47 తేదీన సమావేశమై మన దేశము స్వతంత్రము సంపాదించినందుకు తమ సంతసమును వెలిబుచ్చిరి. మరియు స్వతంత్ర హిందూదేశమున ఆయుర్వేదవైద్యమును ప్రోత్సహించవలసినదని ప్రభుత్వమును కోరుచూ తీర్మానించిరి.

(Sd) వి. హయగ్రీవాచార్యులు, కార్యదర్శి.

## మద్రాసు చిత్రాలు

చాలావింతైన పుస్తకం. అన్నిఫోటోలే. మద్రాసులో విధిగాచూడవలసినవన్ని, మీ కుటుంబముతో సహా మీ యింట్లోనే చూడగలరు. వెల 1 రూ. "పుస్తకశాల. కచ్చేరిరోడ్డు, మద్రాసు 4" అని వ్రాయండి.

## ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే.

1890 సంవత్సరపు ఇండియన్ రైల్వేస్ ఆక్టు IX లోని సెక్షనులు 55 & 66 ప్రకారము వేలము అమ్మకపు నోటీసు.

రైల్వేకు యివ్వవలసిన యావత్తు బాకీలు చెల్లించి కన్‌సైనీ ముందుగా డెలివరి తీసుకొనకపోయినచో, రాయపురము గుడ్సు షెడ్‌వద్ద 6-9-1947 తేదీ మధ్యాహ్నము 12 గంటలకు, బహిరంగవేలము ద్వారా క్రింద వివరించిన వస్తువులు అమ్మబడు నని, యిందుమూలముగా ప్రజలకు తెలియపరచడమయినది. కొనదలచినవారు, సరకు మొత్తమే మంచి చెడ్డలు చూసి తృప్తిపడుటకుగాను రాయపురములో స్టేషన్ మాస్టరుకు ముందుగా తెలియపరచి, ఏ సమయములోనైనా సరకును పరీక్షించుకొనవచ్చును. స్టేషన్ మాస్టరుకు అట్టి పరిశీలనకు అనుమతి ఇవ్వవలసినదిగా ఇన్‌స్ట్రక్షన్సు యివ్వడమయినది.

కన్‌సైన్‌మెంట్లు: (1) ఇన్‌వాయిస్ నెం 4 ఆఫ్ 18-7-47 సాంగర్ నుండి రాయపురమునకు.

201 బస్తాల బెల్లం.

దాదాపు తూనిక: 286 మణుగుల 17 శేర్లు

(2) ఇన్‌వాయిస్ నెం 5 ఆఫ్ 28-7-47 సాంగర్ నుండి రాయపురమునకు.

201 బస్తాల బెల్లం.

దాదాపు తూనిక: 291 మణుగుల 18 శేర్లు.

పాడైనతర్వాత, ఏ కారణాలవల్ల గాని, తూనికలో గాని, విషయములో గాని పొరపాట్లయినా, మరేమైనా గాని, కొనుగోలుదారు డబ్బు చెల్లించకుండా ఉండడానికి సరకు డెలివరీ తీసుకోకుండా ఉండడానికి వీల్లేదు.

మదరాసు. 3-9-1947.

చీఫ్ కమర్షియల్ మేనేజరు.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G. T. Madras